జూన్ 2 విడుదల!

శ్రీ విఠల్ ప్రొడక్షన్స్ వారి

# అగ్గిబరాటా

కథ: జి. కృష్ణమూర్తి B.A

సంగీతం విజయాకృష్ణమూర్తి

కెమెరా. వరదరాజ్

కో-డైరెక్టర్స్-K.V.R.ఆచార్య

కో-ప్రొడ్యూసర్ B.V.శ్రీనివాస్

నిర్మాత దర్శకుడు

B.విఠలాచార్య



# ఉత్తరాలు

### కథలు

"మలుపు తిరిగింది" కథ చదివాను. పాఠకుల ఉత్తరాలు కూడా చదివాను. నాకు తోచిన అభిప్రాయాలు ఈ క్రింద వ్రాస్తున్నాను.

15—4—66 సంచికలో ఒక పాఠక మిత్రుడు "కవరు ప్రేగ్రౌండు అడ్రసు కేమైనా వచ్చిందా!" అని ప్రశ్నించారు. కవరు ప్రేగ్రౌండు అడ్రసుకు రాకపోయినా పోస్టు మాను కవరు ప్రేగ్రౌండుకు తెచ్చియివ్వడానికి కథలోనే చాలా అవకాశాలున్నవి. పాఠకమిత్రుడు మరొకసారి కథ చదువమని కోరుచున్నాను.

కథలో "ప్రభావతికీ, పెళ్ళి చేయాలనే తలంపూ ఉన్నవాడు"—ఇది పొరపాటుగా చెప్పారు. అసలు కథలో ఉన్న వాక్యం 'ఉద్యోగానికి ప్రభావతికి పెళ్ళి చేయాలనే తలంపు ఉన్నవాడు' అంటే ఉద్యోగం వచ్చాక ప్రభావతిని పెళ్ళి చేసుకోవాలనే తలంపు ఉన్నవాడు అని అర్థం.

ఎత్తు తగ్గి పోవడాన్ని గురించి ఈ పాఠక మిత్రుడే మరొక ప్రశ్న వేశాడు. ఎత్తు తగ్గి పోవడమనేది అతిశయోక్తి—నిజంగా 6 అడుగులున్న మనిషి 5'—6 అంగుళాలు తగ్గిపోయాడని రచయిత ఉద్దేశంకాదు.

రామకృష్ణ రాజా (అనంతపురం)

* * *

కోమలాదేవిగారి విచిత్రమైన "పొరపాటు" కథ చదివినతరువాత రచయిత్రి అనుభవముగా వ్రాసినదని ఊహించుటకు అటే సమయము తీసుకొనదు. అందులో అమర్‌నాథ్ గారి పాత్ర బాగుగా పోషించారు.గాని అరవింద్ శాంతికి ఆమె అడ్రసు తెలియకుండా ఉత్తరము ఎలాగున వ్రాసెడా అని నాకొక ధర్మసందేహము. మొత్తముమీద రచయిత్రిగారు ఒక పెద ఉదేశము తీసుకొని కథ వ్రాసటున్నది. రచయిత్రి గారికి నాఅభివందనములు.

డి. కూర్మారావు (బారువ)

* * *

కోమలిదేవిగారు వ్రాసిన 'పొరపాటు' కథ చాలబాగుంది. శాంతివంటి స్త్రీ లు మహిళా లోకములో అరుదు. రచయిత్రికి నా అభివందనములు.

నారపలి అప్పారావు (అనకాపల్లి)

* * *

29—4—66 వారపత్రికలో మీరు ప్రచురించిన "చివరకుమిగిలింది" కథ బాగున్నది. ఆకథలో 38 వ పేజీలో "బిడ్డమీద రైలుబండి నెలలునిండిన చూలాలుగా నడవలేనటుగా నడుస్తూంది" అని వ్రాయుటకు బదులుగా "బిడ్డమీద రైలుబండి నెలలు నిండిన బాలింతలా నడవలేనటుగా నడుసూ ంది" అని ప్రచురించినారు. కాబటి రచయిత్రి ఈపొరపాటును గమనించ కోరా ను.

మునాలూరి స్వర లత (లింగాల)

### కథలు—కలలు

29—4—66 పత్రికలో కస్తూరి సత్యనారాయణగారు "ఎవరికైనసూ తాము చనిపోయినటుగా కలరాదు. తాముచనిపోకున్నంత వరకే కలవసు ంది. తరువాత సడన్‌గా తెలివొసు ంది."అని వ్రాశారు. అలావస్తే అసందర్భము అని కూడా వ్రాశారు. వాస్తవానికి కలలకి అసలు సంభంధం వుండదు. నాకు, నాస్నేహితులకు అటువంటి కలలు చాలాసార్లు వచ్చాయి. మేము వింతగా చెప్పుకొని ఆనందించేవాళ్లము. కలలకి ఒక అర్థము వుండదు. కనివిని ఎరగనివి కలలోరావచ్చును.

ఎం. ఆర్. ఎస్. రావు (రూర్కెలా)

### విజ్ఞప్తి

నేను రాసిన వాంటెడ్ ఫాదర్స్ (హాస్య నాటిక — ఉగాది సంచిక) ని చదివి, 15—4—66 వారపత్రికలో ప్రచురించిన నా చిరునామాకి ఆ నాటిక ప్రదర్శనకి అనుమతి నివ్వవలసిందిగా చాలామంది ఉత్తరాలు రాస్తూన్నారు.వారందరికీ నా విజ్ఞప్తి ఇది—

వాంటెడ్ ఫాదర్స్‌ని ప్రత్యేకమైనపోటీలో మినహాయించి మిగతా సందర్భాలలో ఉదా: కళాశాల వారి కోత్సవాలూ వగైరా ప్రదర్శకులు నా అనుమతిని పొందవలసిన అవసరం లేదు. ప్రదర్శన వివరాలు నాకు తెలిజేసే

Roopkala



రేఖా మురళీ ఆర్ట్స్ వారి

# పొట్టి ప్లీడరు

దర్శకత్వం: K. హేమాంబరధరరావు • నిర్మాత B. పురుషోత్తం

రచన భమిడిపాటి రాధాకృష్ణ... సంగీతం కోదండపాణి

స్టూడియో ప్రసాద్... వాణీ రిలీజ్

VIJAYA

# ఉత్తరాలు

చాలు! (గౌరవప్రదమైన ఈ సాంప్రదాయాన్ని 'కొందరు' ప్రదర్శకులు నిర్లక్ష్యం చేసిన సందర్భాలు నా అనుభవంలో చాలా ఉన్నాయి. కారణాలు అనూహ్యము.) కానీ, పోటీలో పాల్గొనేవారు తప్పనిసరిగా నా అనుమతిని పొందవలసి వున్నది. గమనించగలరు.

ఆదివిష్ణు (మచిలీపట్నం)

### సీరియల్

'నిరీక్షణ' పోకడ చాలా బాగున్నది. అందులోని కామాక్షి పాత్ర రచయిత్రి చక్కగా వర్ణించారు. సర్వ సాధారణంగా అత్త, ఆడబిడ్డల విషయంలో ప్రతికోడలు ప్రవర్తనా యిట్లాగే ఉంటుందనుకుంటాను. రెండు వైపుల అనుబంధాన్ని త్రెంచుకోలేక బాధపడేది పురుషుడు. రచయిత్రికి ధన్యవాదాలు. ఆమె వ్రాసిన 'నిరీక్షణ'లోనే 22 వ పేజీ మొదటి కాలమ్‌లో 'కర్మకాండలూ ముగిసిన తర్వాత రాధ తల్లి వాళ్ళతో పుట్టింటికి వచ్చేసిందని వ్రాశారు రచయిత్రి. కాని హిందూ సంప్రదాయ ప్రకారం 15 రోజులకుగాని కొంతమందికి 11 వ రోజునగాని కర్మకాండలు ముగిస్తారుకదా! విధవయ్యిన స్త్రీని మూడోనెలలో కాని ఐదవనెలలో కాని పుట్టింటికి తీసుకవస్తారు. ఇది హిందూ సంప్రదాయానికి విరుద్ధముగానున్నది. ఇలాంటి చిన్న తప్పులను సరిదిద్దుకొంటే బాగుంటుందనుకుంటాను.

తన్నీరు అలివేలు మంగతాయారు
(పెరవలిపాలెం)

* * *

ఈవారం 'కరుణ' సీరియల్ చదువుతున్నంతసేపు ఏదో జరుగుతున్న సంఘటనని చూస్తున్నట్లుగానే వుండినది. మావారి పిలుపుతో నిజప్రపంచానికి వచ్చిం తర్వాత ఇది కథఅని నా కళ్ళవెంట నీళ్ళు కారుతుండటం గమనించాను.

మదనంబేడు విజయలక్ష్మి (అనంతపూర్)

* * *

'కరుణ' సీరియల్ ముగింపు కావస్తోందనగానే నాకెంతో — విచారాన్ని కలిగించిందంటే నమ్మండి.

వి. ఫణికుమార్ (సికింద్రాబాద్)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 20—5—66

పరాభవనామ సం॥ వైశాఖమాసం బహుళ॥ అమావాస్య

సంపుటము 58 సంచిక : 38

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

**భారతదేశం**

| | పోస్టుద్వారా<br>రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

**ఇతర దేశాలకు**

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |


వచ్చేవారమే!

★

వినిపించని
మహాగివేదన!

# మన లో మాట

సరిహద్దుల్లో సంఘర్షణలను గురించి, తాష్కెంట్ సమావేశాన్ని గురించి తరచుగా వాదోపవాదాలు వినిపిస్తున్న యీ తరుణంలో 'సిక్కిం'కు మంచి ప్రాముఖ్యత వున్నది. సిక్కిం రాజవంశంలో ముఖ్యులైన రాజు, రాణిని గురించి తెలిపే వ్యాసం యీ సంచికలో వేస్తున్నాము.... రచయిత్రి సుశీలారావు యిదే అంశం గురించి వ్రాసిన మరో వ్యాసాన్ని లోగడనే వేశాము.

* * *

'భర్తలెలా వుండాలి?' అనే కథ యీ సంచికలో ఒక ఆకర్షణ. శ్రీ అరిగే రామారావు రచించిన 'భార్యలెలా వుండాలి?' అనే కథను కొన్ని మాసాల క్రితం ప్రచురించాం.

* * *

శ్రీమతి జమునకు శ్రీవారు బాగానచ్చినట్లున్నారు. ఎంత బాగా నచ్చారో తెలిసికోటానికి 10, 11 పేజీలు చూస్తే తెలుస్తుంది.

* * *

29—4—'66 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో పడిన 'యామిని' కథ 'చివరకు మిగిలింది' వేరొక మాస పత్రికలో పడినట్లు తెలుపుతూ కొందరు పాఠకులు మాకు రాశారు. ఈ విషయమై 'యామిని'కి రాయగా వారు పై కథని మరొక పేరు కింద మరొక పత్రికకి 1965 జూలైలో పంపినట్లూ, దాని ప్రచురణ సంగతి ఏమీ తెలియకపోగా 1966 మార్చిలో పేరు మార్చి మాకు పంపినట్లూ రాశారు.

'యామిని' మాకు రాసిన ఉత్తరం సారాంశం పాఠకులకి తెలియచేస్తూ, ఎటువంటి పరిస్థితులలో ఇదంతా జరిగిందో అర్థం చేసుకోగలరని ఆశిస్తున్నాము.

ఆంధ్ర సచిత్ర వారపత్రికకి కథలు పంపే వారందరికీ తమ కథలు ప్రచురణకి ఎన్నిక అయినదీ లేనిదీ తెలుపుతూ కార్డులు పంపుతూ ఉన్న సంగతి పాఠకులకి తెలిసినదే.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'సంగీతలక్ష్మి' శ్రీమతి జమున.


చెదిరి పోయిన ఆర్థిక సిద్ధాంతాలు
కాంగ్రెస్
ఈ ముసలాడు యింకెందుకోం


నిషేధపు ఉత్తర్వులు
సాకెట్
పారిపోతున్న దొంగ


విజ్ఞాపనలూ నేనే సలహా అచ్చా! మరి మీరూ వినాలి


బంగారపు నియంత్రణ ఉత్తర్వు
మునిగిపోతున్న నౌక

న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# విదేశీ సహాయం: మీనన్, మాలవ్యాల వైముఖ్యం

ప్రభుత్వం అనేది ఒక పబ్లిక్ సంస్థగానూ, కాంగ్రెస్ పార్టీలోని సభ్యులంతా అందులో వాటాదారులుగనూ, కేబినెట్ బోర్డు ఆఫ్ డైరెక్టర్స్‌గనూ పండితనెహ్రూ, ఆయన తర్వాత వచ్చిన కీర్తిశేషులైన లాల్‌బహదూర్‌శాస్త్రి భావించారు. ఆ వాటాదారు లెప్పుడూ సాధారణ సమావేశాలలోనే నిర్వాహకవర్గాన్ని విమర్శించాలికానీ, బహిరంగంగానూ, లేక పార్లమెంట్ అనే మరొక వేదికపైనా కాదు.

నెహ్రూగారి హయాంలోని తొలిరోజుల్లో శ్రీ శివరావు ఈ నియామాన్ని ఉల్లంఘించారు. తరువాత ఆయనకి లోక్‌సభ టికెట్ ఇవ్వలేదు. ఆయన తెర మరుగున పడిపోవటానికి ముందు మూడు సంవత్సరాల పాటు రాజ్యసభలో స్థానాన్ని ఇచ్చారు.

లాల్‌బహదూర్‌శాస్త్రిగారి హయాంలో మాడమ్ పండిట్ పార్టీ మంత్రులను "ప్రిజనర్స్ ఆఫ్ ఇన్‌డెసిషన్" అని రాజ్యసభలో అన్నతరువాత ఆమె కొంత అవస్థ పడాల్సి వచ్చింది.

శ్రీయుతులు కృష్ణ మీనన్, పండిట్ కేశవ్ మాలవ్యాలు శ్రీమతి గాంధి ప్రభుత్వాన్ని ఎదుర్కోడానికి బహిరంగంగా తలపడ్డారు. వాళ్ళిద్దరికీ అమెరికానుంచి లభించేది ఏది పడదు. మూడవ ప్రణాళిక నిమిత్తం ఒక బిలియన్ డాలర్ల అమెరికా సహాయాన్ని అందుకున్న నెహ్రూగారి ప్రభుత్వంలోని సభ్యులే వీరిద్దరూ. అప్పుడు ఆర్థిక మంత్రిత్వ శాఖలో, ఆర్థిక విషయాలకు సంబంధించినశాఖ కార్యదర్శిగాఉన్న శ్రీ బి. కె. నెహ్రూ పర్యటించే రాయబారిగా పశ్చిమ దేశాలకు, అమెరికాలో భారత రాయబారిగా, సహాయం లభించే ప్రయత్నాలు చేయడానికి నియమింపబడ్డారు. ఈ నియామకంలో శ్రీయుతులు కృష్ణమీనన్, మాలవ్యాల అంగీకారం కూడా ఉంది.

పండిత మాలవ్యా ఒకప్పుడు నూనె శాఖామాత్యులుగా ఉన్నారు. అప్పుడాయన కొచ్చిన్ నూనె శుద్ధి కర్మాగారం ఒప్పందాన్ని పరిష్కరించడంలో ఎక్కువ పలుకుబడినే ఉపయోగించుకున్నారు. కొచ్చిన్ నూనె శుద్ధి కర్మాగారం ప్రభుత్వరంగంలోనిది. అందులో ప్రభుత్వానికి, ఈక్విటీషేర్లలో 72 శాతం వాటా ఉంది. ప్రభుత్వంయొక్క వాటా అధికంగా ఉన్నప్పటికీ ఆ సంస్థ నిర్వహణ హక్కులన్నీ ఫిలిప్స్ పెట్రోలియం అనే అమెరికన్ సంస్థకు ఇవ్వబడినవి. మద్రాసు ఎరువుల కర్మాగారం నిర్వహణ హక్కులను అమెరికన్ ఇంటర్ నేషనల్ ఆయిల్ కంపెనీ అనే మరో అమెరికన్ కంపెనీకి ఇచ్చినప్పుడు భారతదేశాన్ని అమెరికావారికి అమ్ముతున్నారని శ్రీ మాలవ్యా శ్రీమతి గాంధిపై నిందారోపణ చేశారు.

శ్రీ కృష్ణమీనన్ లోక్‌సభలోని ఒక ఉపన్యాసంలో "మనం ఇంకొక బ్రెజిల్ కావాలనుకుంటున్నాము" అన్నారు. కానీ రక్షణశాఖకు సారధ్యం వహించిన శ్రీకృష్ణమీనన్ హయాంలో భారతదేశం బ్రెజిల్ కాకుండా టిబెట్ అయింది అన్న విషయం ఈ దేశ చరిత్ర వెల్లడి చేస్తోంది.

ప్రజలు వారి విధానాలను అంగీకరించక పోయినా శ్రీయుతులు మొరార్జీదేశాయి, టి. టి. కృష్ణమాచారి కేబినెట్‌నుంచి తప్పుకున్నతర్వాత చాలా గౌరవనీయంగా ప్రవర్తించారు. ఇందుకు వ్యతిరేకంగా శ్రీయుతులు కృష్ణమీనన్,మాలవ్యాలు "సోప్ బాక్స్ ఆరేటర్స్" గా తయారైనారు. తాము ప్రజల ముందు కన్పిస్తూ ఉండాలని, ప్రజలు తమను మరిచిపోకూడదనీ వారి ముఖ్యాశయం.



శ్రీమతి ఇందిరాగాంధి

పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీగానీ, అంచనాల సంఘంగానీ శ్రీమాలవ్యా నూనెవిధానం మీదా, శ్రీ కృష్ణమీనన్ రక్షణ విధానం మీదా ఇంతవరకూ పునఃసమీక్ష ఏమీ జరపలేదు.

దీంతో ఈ కథ అంతం అవలేదు. విధానాల్ని ముందు పార్లమెంట్‌లో ప్రకటించాలని ప్రభుత్వం తీర్మానించేవిధంగా చేయటంతో ప్రతిపక్ష సభ్యులు కృతకృత్యులయ్యారు. పార్లమెంటుకు మే 1, 2, 4 తేదీలు సెలవు దినాలు. ప్రతి నిర్ణయం దేశానికి ఎంత అవసరమైనప్పటికీ లోక్‌సభ సమావేశం కొరకు వేచి ఉండాల్సిందే.

కాంగ్రెస్‌పార్టీ సభ్యులు మరో మెట్టు పైకెక్కారు. ప్రభుత్వం తీసుకున్న ప్రతి నిర్ణయం మొట్టమొదట పార్టీలో చర్చించాలని వారు కోరారు. అది ఏ ప్రజాస్వామ్య దేశంలోని ఏ పద్ధతికైనా విరుద్ధమే. కమ్యూనిస్టు దేశాలలో నిర్ణయాలను అమలు జరిపే నిమిత్తం పార్టీకి తెలియపరుస్తారు.

అసలు ప్రజాస్వామ్యం అన్నది జూప్ కని పెట్టారట. ప్రజాస్వామ్య దేశంలోని రహస్యాలు పలువురిమధ్య పంచబడతాయి. అందులో చాలామంది చట్టవిరుద్ధంగా స్వార్థం కోసం ఆ రహస్యాలన్నీ ఉపయోగించుకుంటారు.

ఇదంతా శ్రీమతి గాంధికి వారసత్వంగా లభించిన ఆస్తిలాంటిది. ఎన్నో సమస్యలనీమె ప్రస్తుతం ఎదుర్కొంటున్నారు. ఆమెకుపూర్వం ఉన్నవారి విధానాలు ఇప్పుడు దేశంలో ఉన్న ఆర్థికమాంద్యాన్ని, రాజకీయ అసమైక్యతను సృష్టించినయి. విదేశీసహాయం లభించకపోతే దేశం ఇంకా కృంగిపోతుంది. ఎలాంటి విదేశీ సహాయమైనా భారత

# న్యూఢిల్లీ లేఖ

స్వాతంత్ర్య పరిసమాప్తికి దారితీస్తుందని కమ్యూనిస్టులతో కలిసి శ్రీయుతులు కృష్ణ మీనన్,మాలవ్యాలు ప్రకటిస్తున్నారు. ఆహారం కొరతవల్ల బెంగాల్‌లో జరిగిన ఆందోళను అరికట్టటానికి ఆ యిద్దరిలో ఏ ఒక్కరూ బెంగాల్ వెళ్లలేదు. కానీ ఎయిర్—కండిషన్డ్ గదుల్లో కూర్చుని ఆహారం దిగుమతులనుమాత్రం ఆక్షేపిస్తున్నారు.

వాళ్లు తమ ప్రాబల్యాన్ని కోల్పోతున్నారు. ఉత్తర బొంబాయినుంచి పోటీ చేయడానికి శ్రీ కృష్ణమీనన్‌కి టికెట్ లభించదని గట్టిగా చెప్పవచ్చు. యు. పి. లోని బస్తీ నియోజకవర్గంనుంచి శ్రీ మాలవ్యా మళ్లీ ఎన్నికైతే ఆశ్చర్యకరమైన విషయమే అవుతుంది!

* * *

పార్లమెంట్ బడ్జెట్ చర్చ విదానంగా ముగింపుకు వస్తున్నది. ఫిబ్రవరి 14వ తారీకున రాష్ట్రపతి ఈ చర్చకు ప్రారంభోత్సవం చేశారు. ఏప్రిల్ చివరికి అది 50 సమావేశాలను జరిపింది. ఏప్రిల్ 30 వ తేదీన సమావేశం జరిగింది. మే నెలలో యింకా 12 సమావేశాలను జరపాల్సివుంది. ఇందులో సరిగ్గా అరున్నర సమావేశాలు అనధికార కార్యకలాపాల నిమిత్తం వినియోగింపబడినయి. ఏప్రిల్ నెలాఖరువరకూ 44 గంటలు ప్రశ్నలకు కేటాయింపబడినయి. సరిగ్గా అన్ని గంటలే అప్రస్తుతమైన అన్ని ప్రశ్నలకు వినియోగించబడ్డాయి.

అసలు ఈ చర్చ ప్రారంభించింది శాసన సంబంధమైన కార్యక్రమాన్నిక దానిని అమలు జరపడానికే. అందులో లోక్‌సభలో పూర్తికాని 15 బిల్లులు, ఎనిమిది రాజ్యసభలోనివి, చర్చలమధ్యకాలంలో జారీ చేసిన ఆర్డినెన్సులను తీసివేయడానికి ప్రతిపాదించబడిన రెండు బిల్లులతో కలిపి మరో 24 బిల్లులు ఉన్నాయి. ఇవన్నీ ఫైనాన్స్ బిల్, పంజాబ్ విభజన ననుసరించి రూపొందించిన రాజ్యాంగ సంబంధమైన బిల్లులుకాక.

దీన్నే యింకోవిధంగా చెప్పాలంటే శాసనాలకు సంబంధించిన కార్యక్రమం యిటీవల సంవత్సరాల్లో చాలా మందకొడిగా నడుస్తున్నదని చెప్పవచ్చు.

సాధారణ బడ్జట్ ఫిబ్రవరి 28 వ తేదీనే యివ్వబడింది. బడ్జట్‌పై ఒక సాధారణ చర్చ, గ్రాంట్ల అవసరాలపై వోటింగ్‌లతో యిది ప్రారంభింపబడింది. రెండవ సంవత్సరం జరుగుతున్నా పెద్ద మొత్తాలలో ఉన్న గ్రాంట్‌లు కావాలనే కోరికలు యింతవరకూ చర్చింపబడనేలేదు.

కాంగ్రెస్‌పార్టీవారూ, ప్రతిపక్షాల వారూ వలన విధానాన్ని ఆక్షేపించడంలోమాత్రం ఒకటైనారు. గ్రాంట్స్‌లోనుంచి కావాలనే

(47 వ పేజీ చూడండి)




కథ.మాటలు.పాటలు పింగళి నాగేంద్రరావు • సంగీతం:పెండ్యాల

నిర్మాత
దగ్గుబాటి లక్ష్మీనారాయణచౌదరి

దర్శకత్వం
ఏ.కె.శేఖర్

ఆంధ్ర, సీడెడ్:
విజయ

నైజాం:
ఉషాఫిలింస్

# నటి జమునతో గోష్ఠి

"రాజీపడటం అంటే ఏమిటో, నాకసలు తెలియదు" అంది జమున సగర్వంగా. తనేం కోరుకుంటే, మరుక్షణమే అవి సిద్ధించాయని, తన అభిప్రాయానికి వ్యతిరేకంగా నడుచుకోవలసిన అవసరం ఇంత వరకు ఎన్నడూ రాలేదని శ్రీమతి జమున ఘనంగా చెప్పుకొంటోంది.

సినిమారంగంలో జమునకొక వ్యక్తిత్వం వుంది. వ్యక్తిత్వం చుట్టూ అశేషమైన ఆకర్షణ, విశేషమైన లోకజ్ఞానమూ ఉన్నాయి. అభిమానుల ఆదరాభిమానాలు, సాటివారి ప్రేమాభిమానాలు కూడా ఆమె వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దాయనటంలో సందేహంలేదు.



ఆనందం

## మైలురాయి....

అందరి నిజ జీవితాల్లోలాగే, నటిజమున జీవితంలో కూడా 'వివాహం' ఓ ముఖ్యమైన మైలురాయి. ఆగస్టు 4 న తిరుమలలో శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిన సంప్రదాయబద్ధంగా జరిగిన 'పరిణయం' జమున నిజ జీవితాన్నే మార్చివేసిందని, ఆమె వ్యక్తిత్వంలో ముందెన్నడూ కానరాని అణకువ, ఆ అణకువకుతోడు మెళకువ వచ్చాయని ఒక వ్యాఖ్య!

ఇప్పుడామె నటి మాత్రమేకాక, గృహిణి కూడా. పైగా, లేటెస్ట్ 'డాక్టరేట్' పట్టం



ఆనాడే బొమ్మ...

"శ్రీవారితో ఉదయవిహారం"

# వినిపించని మూగవేదన

వ్యాసం: మాధవ్

ఫొటోలు: ప్రభాకర్



బండెడు బరువును లాగలేక లాగుతున్న బక్కచిక్కిన జీవాలు.

మండువేసవి మధ్యాహ్నసమయం ఎండ విప్పులు చెరుగుతోంది సూర్యభగవానుడు నడినెత్తిపైకి వచ్చి భూతలంపై వున్న ప్రాణికోటి మీద తన ప్రతాపాన్ని ప్రదర్శిస్తున్నాడు కొలిమిలోనించి వస్తున్నట్లు వేడిగాలి రివ్వున ఈచెవిలోనుంచి ఆచెవిలోకి కొడుతోంది గ్రీష్మతాపానికి తట్టుకోలేనికొందరు బాటప్రక్కన ఉన్న భవనాల నీడలలోకి పరుగులు తీస్తున్నారు రోడ్డుకు కొంచెం దూరంలో ప్రక్కగా ఉన్న చిన్న చిన్న గుంటలలో అడుగున ఏకొద్దిగానో నీళ్ళుఉన్నట్లున్నాయి కొన్ని గేదెలు వాటిలో పడుకుని అటూ యిటూ పొర్లుతున్నాయి తాపాన్ని తగ్గించుకునేందుకు దూరంగా ఉన్న వో చెట్టుక్రింద నాలికబయట పెట్టి వగరుస్తూ తీరికగా పడుకుని ఉష్ణాధిక్యతను ఉపశమింపజేసుకుంటోంది వో కుక్క-ప్రచండభానుని ప్రతాపానికితాళలేక ప్రాణికోటి అంతా వేదనకు గురిఅవుతున్న ఆసమయంలో -వీటన్నిటినీ మించిన ఆవేదనాపూరితమైన దృశ్యమొకటి మా అడుగు ముందుకు పడకుండా చేసింది.

నిండుగా సామానులు వేసుకుని వస్తున్నది వో రెండెడ్లబండి దానిపై బరువును చూస్తేనే తెలుస్తుంది, అంతకంటే యింకా ఎక్కువవేస్తే బండి విరుగుతుందేమోనని భయపడి వేయలేదని వి రా మం లే కుం డా ప్రయాణం చెయటంవల్ల బండిని లాగుతున్న బక్కచిక్కిన ఎడ్లు నోటివెంబడి నురుగులు కక్కుతున్నాయి. వగరుస్తూ వేగంగా లాగలేక మెల్లగా ఈడుస్తున్నాయి బండిని. ఇంతలో బాగా ఏటవాలుగా ఉన్న బ్రిడ్జి వొకదాన్ని దాటాల్సివచ్చింది. అంతవరకూ సమతలంగా ఉన్న బాటపై శక్తినంతా కూడదీస్సుకుని లాగలేకలాగుతున్న ఆజీవాలకు బ్రిడ్జిని ఎక్కడం శక్తినిమించిన పనైపోయింది. ఎలాగో కొంతదూరంలాగి యిక మావల్ల కాదన్నట్టు నిలబడిపోయాయి ఎడ్లు. దాంతో ఆబండిమీదున్న వ్యక్తి కోపంతో లేచి బండిమీదనే నిలబడి శక్తికొద్దీవాటిని కొట్టటం ప్రారంభించాడు. ఎద్దు అతడు కొట్టే దెబ్బలను సహించలేక, తలకి మించిన బరువును బ్రిడ్జి ఎక్కించలేక సతమతమవుతున్నాయి అడుగు ముందుకు వేయటానికి, బండిపై ఉన్న వ్యక్తి కొట్టే దెబ్బలను వోర్చుకొనటానికి కూడా శక్తిలేని ఆబక్కచిక్కిన జీవాలు ఎలాగో ముందడుగు వేయటానికి ప్రయత్నించాయి.



[illegible]

శక్తినంతా కూడదీసుకుని లాగటానికి చేసిన ఆ ప్రయత్నంలో నిలవలేక ఒక ఎద్దు చతికిలబడింది యిక తన పనైపోయిందన్నట్లు వెంటనే బండివాడు రెట్టించిన కోపంతో కిందికి దూకి చేతిలోని కర్రతో శక్తి కొద్దీ దాన్ని దారుణంగా కొట్టటం ప్రారంభించాడు హృదయాన్ని కదిలించే ఆ దృశ్యాన్ని చూసి దారేపోయే కొందరి గుండెలు కరిగి తలా ఒక చెయ్యి వేసి బండి ముందుకు పోవడానికి సహాయం చేశారు లేకుంటే పర్యవసానం ఎలా ఉండేదో ఊహించటం కష్టం.

ధనార్జనే ముఖ్యోద్దేశ్యంగా పెట్టుకున్న ఈ బండ్లవాళ్లకు ఆ మూగ జీవాల బాధ ఎలా అర్థమవుతుంది.

కొన్ని సందర్భాలలో శక్తికి మించిన బరువులు లాగలేక, వంతెనలు ఎక్కలేక బండి పైన ఉండే వ్యక్తి కొట్టే దెబ్బలకు

# పాతకథ

## పురాణం సూర్యప్రకాశరావు

"ఏవ్యక్తితోనైనా సరే కాసేపు మాట్లాడే అవకాశం దొరికితే వాళ్ళు అతణ్ణి గురించి ఓ కథ రాయటానికి సరిపడే సమాచారాన్ని 'సేకరించగలను' అని అన్నారు ఓ సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత. ఈ ప్రకటనలో కేవలం ఆయన ప్రజ్ఞ మాత్రమే కాకుండా" ప్రతి జీవితమూ అద్భుతమూ రసవత్తరమూ అయిన కథావస్తువే అవుతుంది దర్శించగలిగితే" అన్న సత్యం ఇమిడివుందా అనిపిస్తుంది. ఆ ప్రకటనని దృష్టిలో పెట్టుకుని నేనూ ఓ చిన్న ప్రయోగం చేసినతర్వాత ఈ సత్యం బోధపడింది.

* * *

చక్రపాణిని అడిగాను. "మీ జీవితంలో మిమ్మల్ని ఎక్కువగా కదిలించిన రసవత్తరమైన మరుపురాని అనుభవాలు ఏమైనా ఉన్నాయా? చెప్పటానికి వీలున్నదా?" అని.

ఆయన చెప్పిన కథ ఇది:

చక్రపాణి చిన్ననాటినుంచి చదువులో అందరికంటె ముందు వుండేవాడు. పోటీల మీద అందరికంటె మంచి మార్కులు తెచ్చుకునేవాడు. తోటి విద్యార్థులు చాలా మంది అతని దగ్గరకొచ్చి చదువుకుంటూ వుండేవారు. అలా చదువుకునేవాళ్ళలో అనూరాధ అనే అమ్మాయికూడా ఉండేది.

పెద్ద చదువులోకి వచ్చినతర్వాత కూడా ఆ పరిచయాలు అలా వృద్ధి పొందుతూనే వచ్చాయి. ఒకనాడు అనూరాధ చదువుకుందుకు తీసుకు వెళ్ళిన పుస్తకం తిప్పి పంపుతూ, అందులో ఒక ప్రేమలేఖను కూడ ఉంచింది. చదువుకుని చక్రపాణి తికమకపడ్డాడు. చిన్ననాటి నుంచి పరిచయం వున్నా ఆమె గురించి అతను వేరుగా ఎప్పుడూ ఆలోచించి ఉండలేదు. పరస్పరం ప్రదర్శించుకునే స్నేహ సంబంధమైన అభిమానాన్ని ఆమె ఇలా అపార్థం చేసుకుందా? ఈ అభిమానాన్ని ఆమె ప్రేమగా రూపొందించుకుందా?' అని అతను కలవరపడ్డాడు. ఈ సంఘటన మొత్తానికి అతనిలో పెద్ద సంచలనాన్ని తెచ్చింది. మొదట్నించీ ఎంతో బాధ్యతతో వ్యవహరించటానికి అలవాటుపడిన కుటుంబ భారాన్ని ఒక్క రెక్కమీద మోస్తున్నవాడు కావటంవల్ల ఏ పని చెయ్యటానికైనా నాలుగు వైపుల్నించి ఆలోచించిగాని అడుగు ముందుకు వెయ్యని మనస్తత్వం అతనికి అలవడివుంది.

ఆమె ముఖతా తన అంతస్సు విప్పి చెప్పినతర్వాత అతని భావాలు, ఆలోచనలు అదుపుతప్పి అతణ్ని తలక్రిందులు చెయ్యక పోలేదు. 'తాను కూడా ఆమెను ప్రేమిస్తున్నాడా"అని తియ్యగా అనిపించిందతనికి. ఈ అనురాగం బలపడి ఆమెను తలచుకున్నప్పుడల్లా ఆనందంతో కొండంతగా ఉప్పొంగినట్లు అనిపించినా అఖాతమంత దిగులు వెన్నంటి క్రుంగదీస్తూ ఉండేది. ఇంత ప్రేమాభిమానాలను ఆమె మీద పెంచుకుంటె చివరికి భగ్నమయితే ఈ జీవితాలు ఏమయిపోతాయో అని కూడా అతడు ఆలోచించకపోలేదు.

తన ఉత్తరానికి సమాధానం ఆశించిన అనూరాధతో అతను ఈ విషయమే చెప్పాడు. "చూడు అనూరాధా. నన్ను అపార్థం చేసుకోకుండావుంటే ఒక్కమాట చెబుతాను. నీ అంతట నువ్వు ఆలోచించు. మనిద్దరి పొత్తూ సాధ్యపడేదేనా?"

ఆమె సమాధానం ఇవ్వలేదు. తల వంచుకునే కూచుంది మూతి ముడుచుకుని.

"ఎందుకు సాధ్యం కాదు?" అని ప్రశ్న. నన్ను వివాహం చేసుకున్ననాడు మనం సమాజాన్ని ధిక్కరించాల్సి వుంటుంది. మన కుటుంబంతో మనకిఉన్న సంబంధాలన్నీ తెగిపోతాయి. అయినా ఫర్వాలేదు—నా రెక్కలమీద నేను నిలబడగలిగితే. ఆ శక్తి కూడా ప్రస్తుతం నాకులేదు. నా చదువూ ఓ కొలిక్కిరాలేదు. పట్టుమని పదిరూపాయలయినా సంపాదించే శక్తి లేనివాణ్ని నిన్ను ఏం సుఖపెట్టగలను. "చివరకి ఇన్ని త్యాగాలు చేసి ఇంతమందినీ కాదని మనకి మనమే భారమైతే ఏమిటి బావుకునేది?"

ఆమె ఉలకలేదు. పలకలేదు.

చివరికి అతను "ప్రేమ అనేది ఉన్నవాడు ఇలా ఎవరూ చెప్పలేరు. ఇవన్నీ సాకులు" అనుకుంటున్నావుకదూ? జీవితంలో సాహసమొక్కటే చాలదు అనూరాధా! అర్హతలు కావాలి. బ్రతికటానికి" అన్నాడతను.

అయినా ఆమె మనసు మార్చుకోలేదు. ఆమె తన్ని అపార్థం చేసుకుంటుందేమో అనే బాధ అతనికి లేకుండా ఆమె చివరికి "మీ మనసు నాకు తెలుసు. నా మనసు మళ్ళించకోలేకుండా ఉన్నాను" అని సమాధానం చెప్పింది. ఆఖరి మాటలు సగం బైటకీ సగం లోపలికీ మింగుతూ.

జీవితంలో నిర్మలమైన ప్రేమని పొందగలిగే భాగ్యం ఎందరికి లభిస్తుంది? ఆమెకు తాను తప్ప అన్యమైన యోచన లేదనే తలపు అతణ్ని ఆనందంతో ఉక్కిరిబిక్కిరి చేసింది.

"ఒక పని చేదాం అనూరాధా"

ఆమె కళ్ళలో వెయ్యి దీపాల వెలుగు చూసాడతను.

"జీవితాన్ని తేలిగ్గా అంచనా వెయ్య



# మీరు ముసలివారైనపుడు మీ చేతికర్ర ఒక్కటే మిమ్ము ఆదుకోగలదా?

మీరు ఉద్యోగంనుంచి విరమించేరోజు ఎప్పుడో ఒకప్పుడు వచ్చి తీరుతుంది అప్పటికింకా మీ కుమారులు చదువుతూనే వుండవచ్చు పెళ్లి కావలసిన ఆడపిల్లలు కూడా వుండవచ్చు

మీకు వెంసరి వచ్చే పింఛను మీ ఖర్చులకు సరిపోతుందా? నిజంగా?

మీ భవిష్యత్తును భద్రపరచుకోడానికి ఇదే అదను మీ వద్ద ఒక్క రు 5/- లు వుంటే నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌లో మీరు సేవింగ్స్ అక్కౌంట్ ప్రారంభించవచ్చు ఆ తరువాత మీరు అనుకట్టే మొత్తాలు చిన్నవే అయినా మీరు ఎగ్గపడవలసిన పనిలేదు మీ సరసన వుండే ఖాతాదారునితోపాటుగానే మిమ్ము కూడా గౌరవించి, సేవచేస్తాము

ప్రతి ఒక్కరికి మేమే బ్యాంకర్లు కావడంలో ఆశ్చర్యంలేదు

మీరు దాచుకొనే డబ్బు మా వద్ద సురక్షితంగా వుండడమే గాక సాలీనా నూటికి 4 రూపాయల వడ్డీనికూడా అది సంపాదిస్తుంది పైగా మీరు దాచుకున్న డబ్బును ఎప్పుడు పడితే అప్పుడు మీకవసరమైనపుడు మీరు తీసుకోవచ్చు

నేడే నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌కు వెళ్లండి అది మీ బ్యాంకు. మేము కుటుంబానికి సేవచేసేవారము కావడమే దీనికి కారణం

## జ్ఞాపకముంచుకోండి, నేషనల్ అండ్ గ్రిండ్లేస్ కుటుంబపు బ్యాంక్



## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది. మెంబర్ల బాధ్యత పరిమితం

అసోసియేటెడ్ బ్యాంకులు: లాయడ్స్ బ్యాంక్ లిమిటెడ్, నేషనల్ ప్రావిన్షియల్ బ్యాంక్ లిమిటెడ్.

బ్రాంచీలు: మద్రాసు 3, నార్త్ బీచ్‌రోడ్, 378, నేతాజి సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (లాయడ్స్ బ్రాంచి); 6, ఆర్మీనియన్ స్ట్రీట్. 168, మౌంట్ రోడ్డు హైదరాబాద్ అబిడ్ రోడ్.

# పాత కథ

పోయింది. ఇక ఆ తర్వాత జరగవలసిన కట్టడులు, అభ్యంతరాలు, నెత్తి మొత్తుకోవటాలు, బెదిరింపులు వచ్చి చెప్పటం అన్నీ జరిగాయి. తండ్రి తెలివైనవాడు. "హతెరీ! ఎవడువాడు? చీల్చి తాను నరుకుతాను అనకుండా నయానా భయానా పిల్లకే నచ్చచెప్పాలనిచూశాడు. "మరొకరయితే ఏం చేసేవారో తెలుసా?" అని తల్లి భయపెట్టింది. ఈ బెదిరింపుల కట్టడులు తట్టుకోలేక "ఇక మీ ఇష్టం" అనే వరకూ ఒత్తిడి చేసారు. అనూరాధ దృష్టిలో అంత మంచి తల్లిదండ్రులూ ఒక్కసారి అర్థంలేని మనుష్యులయిపోయారు.

గుట్టు చప్పుడు కాకుండా రెండో ఇంటివాడికి తెలియకుండా జరిగిపోవాల్సిన పెళ్లి విషయంలో ఇద్దరూ అమాయకంగా ప్రవర్తించామనే తలపుతో చక్రపాణి కృంగిపోయాడు. చేసిన పొరబాటు కూడ దిద్దుకోవటానికి వీల్లేనిది. "ఏం చెయ్యనని నీ చెప్పు చేతుల్లో చిక్కుకొనిపోయాను. ఓడిపోయి తలఒగ్గాను. బందీనైపోయాను" అని చివరి పంక్తులు రాసిందామె.

మొయ్యలేని దుఃఖం ముంచుకు వచ్చిందతనికి.

జరిగిందంతా ఒక కలగా మరిచిపోవటానికి అతను శత విధాల ప్రయత్నించాడు. "ఇక్కడి తప్పెవరిది?" అన్నది ప్రశ్నకాదు. జరగబోయే అవాంఛనీయమైన పరిణామాలను అదుపులో పెట్టలేనప్పుడు మనసునైనా అదుపులో పెట్టుకోవటం ఎలా? అన్నది ప్రశ్న.

చక్రపాణి చెమ్మగిల్లిన కళ్లను వత్తుకుంటూ అన్నాడు. "కాలం అన్నిటికన్న శక్తివంతమైనది. ఎంతటి విషాదాన్నయినా ఎల్లకాలమూ భరిస్తూ కూర్చోలేము" అని. ఎంతో బరువుగా అతను ఎంతో అనుభవంతో అన్నమాటలవి.

రెండు సంవత్సరాలు గడిచినతర్వాత అనూరాధ ఓమారు చక్రపాణి ఇంటికి వచ్చింది. గృహిణిగా ఎంతో అనుభవాన్ని పెంచుకుంది ఆమె. ఎంతో ఆప్యాయంగా ఒకరినొకరు పలకరించుకున్నారు. తన సంసారం గురించి ఎంతో గర్వంగా ఎన్నో సంగతులు ఆమె వినిపించింది. ఆమె భర్తకు తనంటే ఎంతో ప్రేమట! తను ఎలా చెబితే అలా జరిపిస్తాడట!

"సంతోషం అనూరాధా! నే నింకా పరీక్ష పాసు కాలేదు. జీవితంలో అనుకున్నవి అనుకున్నట్టుగా జరగవు. ఇది మామూలే" అన్నాడు చక్రపాణి.

ఆమె నొచ్చుకుంది అతనిధోరణికి. ఆమె చేతిలోని ఎర్ర రుమాలు మూటని బల్లమీదపరిచి "మిఠాయి తెచ్చాను. తీసుకోండి" అంది.

"మిఠాయి తిన్నతర్వాత రుమాలు నాకిచ్చేస్తావా మరి"

"ఇవ్వకపోతే తినరా?"

ఆమె కిలకిలా నవ్వుతూంటే తనవంతు మిఠాయిని చప్పున గొంతులో వేసుకున్నాడతను.

"ఇంతకీ ఏమిటి విశేషం తీపి తినిపించావు?"

"ఇవాళ మా అబ్బాయి పుట్టినరోజు"

ఆమెకు వివాహం జరిగిందని తెలిసిన తర్వాత కూడా మనసు సరుబాటు చేసుకోలేక ఏ అఘాయిత్యానికి సిద్ధమవుతుందోనని అతను అతను ఆందోళన చెందాడు. ఇంటి ఇలాలుగానేగాక ఈ నాటికి తల్లిగా కొత్త బాధ్యతలో కొత్త అనురాగంలో చిక్కుకొనటంతో జరిగిన సంగతులగురించే అసమానమూ ఆలోచిస్తూ కూర్చొనే సావకాశమూలేదు. ఉన్నా అంత ఉద్రేకమూ రాదు. ఇక ఆమె గురించి దిగులులేదు. ఆమె కాపరం స్థిరపడిందని తృప్తి చెందాడతను. పుస్తకాలలో మల్లే మనుష్యులు జీవితంలో ప్రవర్తించలేరు. అలా ప్రవర్తించగలిగివుంటే ఇలాంటి విషయాల గురించి రాయాల్సిన అవసరం ఏనాడో తీరిపోయి ఉండేది. జీవితంలో మనుష్యులుచేసేపనులు పుస్తకాలలోకి ఉన్నదున్నట్లుగా వ్రాస్తే 'పిరుత్తి పిరికివాళ్ళు' అని పాఠకులు తేలిగ్గా అనేస్తారు. పాఠకుల అంచనాలు పూర్తిగా కాదంటున్నాననుకోకండి. వాళ్ళు ఊహిస్తున్నట్టుగా కూడా లోకంలో జరుగుతూంటాయి. కాని అలా జరగటం ఆ మనః

## పాతకథ

...మ్యల జీవిత పరిస్థితులు, కుటుంబ పరిస్థితుల సమాజ పరిస్థితులు, వ్యక్తుల సంస్కారాలమీద ఆధారపడివుంటాయి. అందులో ఇలాంటి విషయాలు కత్తి అంచుమీద నడకలాంటిది. ఉద్రేకంతో చేసే పొరబాటు ఒక్కొక్కప్పుడు అఘాతంలోకి తోసేస్తాయి. కొందరు తొందర పడిపోతారు. కొందరు నిగ్రహంతో వ్యవహరిస్తారు.





వయసు ఉద్రేకంలో ఏనాడూ ఇద్దరూ ఒళ్ళు తెలియని స్థితికి పోలేదు. అది ఒక విషయంగా ప్రవర్తించారు.

ఆమె చెబుతున్న ప్రతి సంగతి అతనిలో ఆందోళనని పధని, తగ్గిస్తున్న మాట నిజమే అయినా ఏదో వెలితి మాత్రం అతనిలో ఉండిపోయింది. "అయ్యో ఇంకోలా జరిగివుంటే ఎంత బాగుండేది. ఆమె తనకు దూరం అయిపోయిందే" అనే బాధ తాలూకు వెలితి అది. అది ఎక్కడ బయట పడుతుందోనని జాగ్రత్తగా తూచి తూచి మాట్లాడాడు.

"నా గురించి దిగులు లేదన్నారు. బాగానే వుంది. అలాగే మీ గురించీ నాకు దిగులు వుండకూడదుగా మరి" అంది అనూరాధ ఉన్నట్టుండి.

అతను క్షణం తత్తరపడినా తేరుకుని "ఇప్పుడు నాకేం వచ్చింది" అన్నాడు.

"ఇన్నాళ్ళూ పెళ్ళెందుకు చేసుకోలేదు."

"చదువు పూర్తయేవరకూ చేసుకోదల్చుకోలేదు."

ఆమె నవ్వు నాపుకుంటూ "ఆ చదువు పూర్తి వటం అంటూ ఉంటుందా?"

అతను సిగ్గుపడుతున్నట్టుగా తలవంచుకున్నాడు.

ఆమె నిట్టూర్చింది. చివరికి వెళ్ళిపోతూ, ఆమె "ఇలా ఒంటరిగా రావటం మీ కిష్టంలేదుకదూ. మీతో ఇంటివారైతే ఇలా సంకోచించాల్సిన పనిలేదు" అంది.

"నువ్వు ఎక్కడో అక్కడ కులాసాగా వుంటే అంతేచాలు"

ఆమె ఆగిపోయి వెనక్కి తిరిగి "అంతేనా?" అంది కొండంత దిగులు స్వరంతో. "నే నలా తృప్తి పడలేను సుమండీ. మిమ్మల్ని చూడకుండా ఉండలేను సుమండీ" అన్నట్టుగా ఆమె చూసింది అంటాడు చక్రపాణి.

ఎర్రజేబు రుమాలు వదిలిపెట్టి అనూరాధ వెళ్ళిపోయింది. ఆ జేబు రుమాలుతో చెమ్మగిల్లిన కళ్ళను వత్తుకున్నాడు

చక్రపాణి.

* * *

ఆ తర్వాత వివాహం విషయంలో అతడ్ని ఒప్పించటానికి పెద్దవాళ్ళకు తలకు మించిన వ్యవహారంకాలేదు. వివాహం జరిగింది. సరస్వతి కాపరానికి వచ్చింది. ఎంతో ఆదరించాడు భార్యని. ఆమె మంచితనానికి ముగ్ధుడై గర్వించాడు. ఏడాది తిరగానే కొడుకు తండ్రయాడు. చక్రపాణి అంటాడు. "నేను నా భార్యను ప్రేమిస్తున్నాను. ఆదరిస్తున్నాను. కాని నా అంతస్సులో అనూరాధ స్థానం మటుకు ఇంకొకరు ఆక్రమించుకోలేరు. అనూరాధ అంతస్సులోనూ నా స్థానం అటువంటిదే. ఆ సత్యం ఇప్పుడు నాకు బోధ పడింది" అని.

సరస్వతితో ఈ గొడవ లేవి అతను ప్రస్తావించదలుచుకోలేదు. ఈ సంగతి సరస్వతికి తెలిస్తే చాలా బాధపడవచ్చు. లోలోపల దాచుకుని మానసికంగా ఆమె కుంగిపోవచ్చు. ఎవరో అనూరాధలాంటి వాళ్ళకి తప్పించి అసూయా ద్వేషాలకు అతీతంగా ఉండలేరు. అందుకనే ఈ రహస్యం ఆమె దగ్గర దాచాడు సంసారక్షేమంకోసం.

సరస్వతి అతని జీవితంలోకి ప్రవేశించిన తర్వాత అనుకోని మార్పులు అతనిలో చాలా వచ్చాయి. ఇప్పుడితని జీవితం ఆగిపోయిన గడియారంలాలేదు. తిరిగి నడక సాగించింది. జీవితంలో చిన్న విషయాలయినా, పెద్ద విషయాలయినా అతను శ్రద్ధ పడుతున్నాడిప్పుడు. నిరంతరంగా ఆలోచిస్తూ పరాకుగా ఉండే అలవాటు తప్పుతోంది. అడుగడుగునా హెచ్చరిస్తూ సరస్వతి అతడ్ని వెన్నంటి ఉండేది.

"మేమూ కాపరాలు చేసాంగాని ఇంత అతి భేషజం ఎరగం" అని కొందరు అనుకోక పోలేదు సరస్వతి గురించి.

ఇప్పుడతనికి తాపత్రయాలు పెరిగాయి. బాధ్యతలు పెరిగాయి. కోరికలు పెరిగితే వాటంతటవే అన్నీ పెరుగుతాయి. ఉద్యోగ బాధ్యతలు, ఇంటి బాధ్యతలు, తీరిక సమయంలో కుర్రవాడితో ఆట పాటలు ఇవన్నీ అతనిలో సంచలనాన్ని తెచ్చాయి.

"ఒక్కసారి అనూరాధ ఈ సంసారం చూడటానికివస్తే బాగుండును. ఎక్కడ వుందో ఏమిటో" అనుకున్నాడు. మనసారా ఒకనాడు.

అనుకున్ననాడే ఆమె వచ్చింది. ఆకుపచ్చరంగు రుమాలునిండా యాపిలు పళ్ళు మూట కట్టుకుని. ఆమె గుమ్మంలో అడుగు పెట్టగానే ఆమె కాళ్ళను చుట్టేసాడు బాబు. లోపల్నుంచి వస్తూనే ఈ దృశ్యాన్ని చూసిన చక్రపాణి క్షణం ఆశ్చర్యంతో నిలబడిపోయి తేరుకుని స్వాగతం చెబుతూ "నీకు నూరేళ్ళు ఆయుర్దాయం. ఇవాళే నీ గురించి అనుకున్నాను" అన్నాడు.

"మనకి నూరేళ్ళు ఏనాడో నిండి పోయాయి. ఇది కొత్త జీవితం" అనుకుంది అర్థ స్వగతంగా బాబుని చంకకెత్తుకుని.

చప్పున కన్నీరు సుళ్ళుతిరిగి శరీరం జల్లుమన్నట్లయిందతనికి.

బాబుని ముద్దు పెట్టుకుని "బాబు మీ పోలికకాదు సుమండీ" అంది.

భార్యకు పరిచయం చేసాడు అనూరాధని. "చిన్నప్పుడు నా దగ్గర చదువుకున్నది" అని.

ముగ్గురూ బయట వరండాలో కూర్చుని చీకటి పడేవరకూ ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకుంటూ గడిపేసారు.

"ఈ రుమాలు నాకిస్తావా. నేను తీసుకు వెళ్ళనా" అంది అనూరాధ బాబుతో. చేతిలోని ఎర్రజేబు రుమాలుని బాబు గట్టిగా పట్టుకుని తల్లి ముఖం లోకి చూసాడు.

సరస్వతి బాబుని దగ్గరగా తీసుకుని "ఇవ్వను. ఈ జేబురుమాలంటే మా నాన్నకు చాలా ఇష్టం అని చెప్పు" అంది.

అనూరాధకి పరిస్థితి అర్థంగాక తికమక పడింది.

చక్రపాణి కంగారు కప్పిపుచ్చుకోవటం ఎవరూ గమనించలేదు.

"పోనీ ఈ ఆకుపచ్చ రుమాలు ఇస్తాను. తీసుకుంటావా?" అంది అనూరాధ ఆమె పచ్చరంగు రుమాలు అందకుండా ఎత్తిపట్టుకుని.

బాబు చెయ్యి జాపాడు. ఒక్క వూపున కుర్రవాడ్ని ఎత్తి పట్టుకుని ముద్దుల వర్షం కురిపించింది అనూరాధ.

ఆమె ఆనందానికి అతడు సంతృప్తి చెందినా ఇంకా [illegible] ఆమె ప్రవర్తనే



# బ్లూ సీల్ టాల్క్

## శరీర దుర్గంధనివారిణి అయిన
## * హెక్సాక్లోరోఫీన్‌తో కూడినది

బ్లూ సీల్ టాల్క్ సాధారణమైన శరీర దుర్గంధ నివారిణులు ఇవ్వలేని రక్షణను ఇచ్చే ప్రత్యేకమైన శరీర దుర్గంధ నివారిణి అయిన హెక్సాక్లోరోఫీన్‌తో కూడియున్నది. సుగంధపూరితమైన బ్లూ సీల్ టాల్క్‌ను ప్రతిరోజూ ఒంటిమీద జల్లుకోండి ... అది అతి చక్కని కొలోన్‌వలె తాజా హాయి నిస్తుంది. మృదువుగా, హాయిగొలుపుతూ చర్మమునకు రక్షణయిచ్చి కాపాడుతుంది.

## * హెక్సాక్లోరోఫీన్ అంటే యేమిటి:

మన దేశమువంటి ఉష్ణాధిక్యతగల దేశాల్లో చెమటకు సంబంధించిన సమస్యలు అతి కఠినమైనవి. చెమట పట్టడం చర్మముపైన సూక్ష్మజీవులు కలిగించే దుర్గంధమునకు దారి తీస్తుంది. బ్లూ సీల్ టాల్క్ జల్లుకొంటే అది చర్మాన్ని సూక్ష్మ జీవులనుంచీ చెడ్డ వాసనలనుంచీ కాపాడుతుంది ... దీనికి కారణం బ్లూ సీల్ టాల్క్ హెక్సాక్లోరోఫీన్‌తో కూడి ఉండడం. హెక్సాక్లోరోఫీన్ ప్రపంచమంతటా అంగీకరింపబడిన శరీర దుర్గంధ నివారిణి.

## — తాజా హాయి
## గొల్పుతూ
## రక్షణయిచ్చే టాల్క్

బ్లూ సీల్ టాల్క్ మీడియం,
ఫ్యామిలీ సైజుల డబ్బాలలో దొరుకుతుంది

చెస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో
యు. ఎస్. ఏ.లో స్థాపితము)

WTP 4869



భార్య అనుమానపడుతుందేమోనని అతని భయం.

అనూరాధ వెళ్ళిపోతూ "చాలా సంతృప్తిగా ఉంది ఇవ్వాళ" అంది.

తనని సంతోష పెట్టగలిగాననే తృప్తి అతనిముఖంలో అనూరాధ గమనించింది. అంతకంటె కావసిందేముంది?

ఇంతవరకూ చెప్పి వూరుకున్నాడు చక్రపాణి.

నేను వ్యాఖ్యానించాను: "ఇంత లేత వయస్సులో ఎన్ని అనుభవాలో. ప్రేమించటం, భగ్నమవటం, త్యాగం చెయ్యటం, ఇంత నిశితమైన అనుభవాలను, ఎలా తట్టుకోగలిగారు? ఆమె అన్నట్లుగా నిజంగా మారేళ్ళూ నిండి పండిపోయారు మీరు" అని. చనువు తీసుకుని చిన్న సలహా కూడా ఇచ్చాను. ఇంతవరకూ ఈకథని మీ భార్యకు తెలియకుండా ఉంచటం చాలా మంచిదయింది. ఇకముందూ తెలియనివ్వకండి. బయటపడి కూడని రహస్యాలు అమాయకంగా బయట పెట్టటంవల నే అనూరాధ ఇంతవరకూ తెచ్చుకుంది. ఇంకో సారి అటువంటి పొరబాటు మీరు చెయ్యవద్దు. జీవితాలను ఇలా వెళ్ళనివ్వటమే మంచిది. ఒకసారి అటువంటి పొరబాటుచేసే దాని ఫలితాలు జీవిత పర్యంతమూ వెన్నాడుతూనే ఉంటాయి" అన్నాను నేను. అటువంటి సందర్భాలు కొన్ని ఉదాహరణంగా చెప్పాను.

అంతటితో ఆగి పోతుందనుకున్న కథని తిరిగి పొడిగించాడు చక్రపాణి. అతని మాటలోనే చెబుతాను.

"అనూరాధ వెళ్ళిపోయింతరాత చాలా సేపు ఆలోచిస్తూ వుండిపోయాను. అనూరాధ ప్రవర్తనబట్టి, ఆమె ఇక్కడఉన్నంత సేపూ కొంత ఇబ్బంది పడుతున్నట్లు తెలిసిపోతూనేవుంది. ఆమె సరస్వతికి భయపడుతూనేవుంది. సరస్వతి ధోరణికూడా అదోమాదిరిగా ఉంది, ఇమె కిలాంటి సరి చయాలంటే ఇష్టం ఉన్నట్లు గాలేదు. ఇక అనూరాధ మా ఇంటికి రాకపోవచ్చుని కూడా నాకనిపించింది. ఈ తలపురాగానే భార్యకు చెప్పేసి ఆమెను ఎలాగైనా సుముఖురాల్ని చేసుకోవాలనుకున్నాను. మళ్లీ మరొక ఆలోచన. బలవంతంగా ఆమెను ఒప్పించటానికి నాకున్న హక్కేమిటి? ఆమె మీద నాకున్న అధికారాన్ని ఇలా దుర్వినియోగం చేసుకోవటం ధర్మమేనా? ఇప్పటికే నలిగిపోయిన ఈ జీవితాన్ని మరింత రభస చేసుకోనా? సరస్వతి ఒకవేళ నన్ను అపార్థం చేసుకోవటమే జరుగుతే అందులో అసందర్భం ఏముంది? ఆశ్చర్యం ఏముంది? ఆ రాత్రి చాలాసేపు ఇలా ఆలోచిస్తూ ఉండిపోయాను. అర్ధరాత్రి ఎప్పుడో నిద్ర పట్టింది.

తెలతెలవారేవేళ కాకులు కూసే సమయంలో ఎవరో తట్టినట్లయి కళ్ళు తెరిచి చూసాను. సరస్వతి నాముఖంమీదకువంగి జుట్టు లోనికి వేళ్ళు పోనిచ్చి "కలవరిస్తున్నారు. రాత్రి చాలా సేపటివరకూ నిద్ర పోలేదుకదూ?" అని అడిగింది.

కళ్ళు నులుపుకుంటూ పరాకుగా "ఏమని కలవరించాను" అన్నాను.

"అనూరాధ అంటూ ముమ్మారు కలవరించారు. ఇంకా ఏవేవో అన్నారు. సరిగ్గా వినబడలేదు."

నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. ఎలాగూ ఆమెకు తెలిసింతర్వాత దాచి ఉంచటం శ్రేయస్కరంకాదని "నీతో ఒక విషయం చెప్పాలని చాలా రోజుల్నించి అనుకుంటున్నాను. వింటావా?" అంటూ ఆమె చేతులు చేతుల్లోకి తీసుకున్నాను.

"నాకంతా తెలుసు. మీరేమీ చెప్పనక్కరలేదు. కొందరి జీవితాలలో మలుపులు ఇలాగే ఉంటాయి. మీది పెద్ద మనసు సుమండీ" అంది ఆమె ఎంతో సానుభూతితో. ఒకప్పుడు అనూరాధకూడా సరిగ్గా ఇలాగే అన్నది.

నేను నిలువునా ఆశ్చర్యపోయాను. ఆమె ముందు సిగ్గుపడిపోయాను. ఆమె ప్రవర్తనలో ఈనాటికీ ఎలాంటి మార్పునాకు కనిపించలేదు." అని చక్రపాణి తన కథ ముగించాడు.

అనూరాధనీ, చక్రపాణినీ ఉదాత్తంగా చిత్రించుకుని సరస్వతిని లోకంలోని సామాన్యుల జాబితాలో మాత్రమే చేర్చిన నేను తొందరపడి వారికంటె ఆమెను తక్కువ అంచనా వేసినందుకు ఒకప్పుడు చక్రపాణి సిగ్గుపడినట్లుగా, ఇప్పుడు నేనూ సిగ్గుపడాను. ●

# సిక్కిం రాజవంశం



భారత ప్రధానితో సిక్కిం మహారాజు, మహారాణి.

కొంతకాలం క్రితం సిక్కిందేశం గురించి రాశాను. మన దేశ రక్షణదృష్ట్యా, దాని ప్రాముఖ్యత పెరిగిన సంగతి చెప్పాను. చైనా కళ్ళు సిక్కింమీదనే ఉన్నాయన్నా అతిశయోక్తి లేదు.

సిక్కిం ప్రజలకి తమ ప్రాచీన సంప్రదాయాలంటే చాలా అభిమానం. వాటిని తొందరగా వదులుకోరు. అందుకనే వారి రాజుగారు అత్యంత ఆధునిక దృక్పథం కల వారు కావటం వారి అదృష్టం. తన దేశ ప్రజల క్షేమం ఈయన పరమలక్ష్యం. తరచు ఢిల్లీకివచ్చి తన రాజ్యాభివృద్ధికి కావలసిన చర్యలు జరుపుతూ ఉంటారు.

రాజాపేరు పాల్డెన్ దోండూప్ నామ్‌గ్యాల్. ఈయన 1963 లో మిస్‌హోప్ కుక్ అనే అమెరికన్ అమ్మాయిని పెళ్లి చేసుకున్నారు. అంతకుముందు సాంగ్‌దేకీ అనే టిబెట్ రాజకుమారిని వివాహం చేసుకున్నారు కాని ఆమె మూడవ శిశువు జన్మించినతర్వాత చనిపోయింది.

మిస్ కుక్, న్యూయార్క్‌లోని సారా లారెన్స్ కాలేజి పట్టభద్రురాలు. చిన్నప్పటి నుంచీ రాయబారవర్గాలలో పని చేసిన తన 'అంకుల్'వద్దనే పెరిగింది. కాలేజిలో చదువుతున్నప్పటినుంచీ తూర్పుప్రాంతాలసంస్కృతి అంటే ఆమెకి చాలా ఇష్టంగా ఉండేది.



'గాంగ్‌టాక్'లోని రాజభవనం.

దాన్నిబట్టే ఆమె భారతదేశానికి 1959 లో మొదటిసారిగా వచ్చింది. అప్పుడే ఆమె అప్పటి యువరాజుగాఉన్న నామ్‌గ్యాల్‌ని కలిసింది. ఇద్దరూ ఒక డార్జిలింగ్ హోటల్‌లో దిగారు. రెండేళ్ల తర్వాత వారి వివాహం నిశ్చయం అయింది.కాని శుభ సంవత్సరం కాదని 1962 ని వదిలి 1963 దాకా ఆగవలసి వచ్చింది.

పెళ్లి గాంగ్‌టాక్‌లో, రాజభవనానికి సంబంధించిన ఒక బౌద్ధ విహారంలో జరిగింది. వివాహం సిక్కిం సంప్రదాయాల ప్రకారమే జరిగింది. సిక్కిం మహారాజు సర్ తాషినామ్‌గ్యాల్ పెళ్లి పెద్దగా ఉండగా, ప్రపంచంలో ఎన్నో ప్రాంతాలనుంచి ఎందరో ప్రముఖులు అతిథులుగా వచ్చారు.

పెళ్లిఅయిన కాడినుంచీ హోప్‌నామ్‌గ్యాల్ సిక్కిం దుస్తులు ధరించటం ప్రారంభించింది. ఈ వస్త్రాలలో ముఖ్యమయిన దానిని 'బాకు' అంటారు. ఇప్పుడు ఆమెకి ఒక కొడుకు. ఆమెకి తన సవతి పిల్లలన్నా, చాలా ఇష్టం. వారికి సంగీతం నేర్పుతుంది. తను విదేశాలకి వెళ్లినప్పుడెల్లా వెంట తీసుకుపోతుంది.

సిక్కింభాష నేర్చుకుని, వీలయినంతదాకా పాశ్చాత్య సౌందర్య సాధనాలని తగ్గించుకుంటోంది. కొత్త వాతావరణానికి బాగా అలవాటు పడిపోతోంది!

—సుశీలారావు.

# వారఫలం

**20-5-1966 శుక్రవారం మొదలు 26-5-1966 గురువారం వరకు.**

**మేషం :** వృత్తివ్యాపారాల్లో మీరు ఘనవిజయాల్ని యేమీ సాధించలేక పోయినా, అన్నివ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. వృత్తిరీత్యాచేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభించవచ్చును. ఉద్యోగంలో మీపరిస్థితి యిదివరకటి కంటే బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేయగలరు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగాఉన్నా, నిర్లక్ష్యం చేయదగదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :** అన్నివ్యవహారాల్లోను ఆదాయంకంటే ఆడావుడి అధికంగా ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో చాలాశ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. ఆదాయంతో నిమిత్తం లేకుండా అవసరానికియేదో ఒకవిధంగా డబ్బుచేతికి వస్తుంది. సాహిత్యకళా రంగాల్లో మీకృషిప్రోత్సాహకరంగా ఉంటుంది. రాజకీయవ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి, ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది

స్త్రీలకు—కుటుంబకార్యక్రమాలకు అనుకోని మార్పులు వస్తాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మిథునం :** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది. వృత్తివ్యాపారాల్లో ఆదాయవ్యయాలు రెండూ కూడా పెరుగుతాయి. వారం ప్రారంభంలో మీతాలూకు వస్తువులు పోయే ప్రమాదంవుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడంతగదు. కుటుంబ సంతోషం లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటికంటే బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం :** ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. ప్రయత్నించిన పనులకు ఆటంకాలు రావడం అనుకోని వ్యవహారాలు నెరవేరడంవంటి సంఘటనలు జరుగుతాయి. రావలసినడబ్బు అందక పోవడంవలన వారంమధ్యలో యిబ్బంది కలుగుతుంది. ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరుస్వయంగా చూటడడం మంచిది. ప్రయాణాల్లో ప్రయాస అధికంగా ఉంటుంది సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**సింహం :** ఆదాయంమాట యెలాఉన్నా, అన్నివ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు మాత్రం బాగా ఉంటాయి. ఇదివరకు మీయెడల శుభావంగా ఉన్నవారుకూడా యిప్పుడు మీఅభిప్రాయాలను గౌరవిస్తారు. వ్యాపారరీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయడానికి అవకాశంలభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యంసామాన్యంగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. విలాస వస్తువులు కొంటారు.

**కన్య:** వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేవో కారణాలవలన ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తిచేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. వ్యాపారంలో మీకు ముముందు ఉపయోగించగల వ్యక్తులను కలుసుకొంటారు ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**తుల :** వృత్తి వ్యాపారాల్లో వారం ప్రారంభంలోనే అనుకోని చికాకులకు గురికావలసి వస్తుందికాని తరువాత అన్నివ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి రావలసినడబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడంతగదు. రాజకీయవ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం అధికంగా కలదు. కోర్టువ్యవహారాల్లో శ్రమమీద అనుకూలతను పొందగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృశ్చికం :** ఏ వ్యవహారాన్నీ పూర్తిగా నెరవేరే వరకూ నమ్మడానికి అవకాశంలేదు. కొన్నివ్యవహారాల్లో మీరు మొగమాటాలకు లొంగిపోవడం వలన ప్రయోజనంలేని బాధ్యతను వహించవలసిన వస్తుంది. వృత్తిరీత్యాచేసే ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో యితరులజోక్యం వలన నష్టం వస్తుంది. ఉద్యోగంలో ముఖ్యమైన పనులు వారాంతంలో చేయడం మంచిది. మానసికాందోళన కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబకార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. సంఘ సేవికలకు మంచి సమయం.

**ధనుస్సు :** అభివృద్ధిమాట యెలాగఉన్నా, వృత్తివ్యాపారాల్లో ఉన్నది నిలబెట్టుకొనడానికే శ్రమ పొందవలసి వస్తుంది. వృత్తిలో సాటివారితోపోటీ పెరుగుతుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. డబ్బు యిచ్చి పుచ్చుకోవడాల్లో చికాకులు రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యంబాగా ఉంటుంది. ఆడంబర కోసం వ్యయం జరుగుతుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో శ్రమకలిగినా దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. వృత్తిలో మీయెదట పొగడుతూ చాటున దూషించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. వ్యాపారంలో మీకు యిముందు ఉపయోగించగల మార్పులు వస్తాయి. ఆర్థికంగా విశేషంత వ్యవహారాలు బాగానేఉన్నా, యితరుల నిమిత్తం శ్రమపొందవలసి వస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణించగలదు. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతానానికి స్వల్ప అనారోగ్యం చేయవచ్చును.

**కుంభం:** ఈవారం సామాన్యంగా ఉంటుంది. సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి మీరు స్వంతగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో యెవరితోను వాదప్రతివాదాలకు దిగడం మంచిదికాదు స్థిరాస్థి వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగాఉన్నా, కొంచెం బలహీనత కన్పిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**మీనం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు తృప్తికరంగా ఉంటాయి. వృత్తిలో యిదివరకు చేజారిపోయిన అవకాశాలు కూడా తిరిగి లభించగలవు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో సమయానికి మిత్రు సహకారం లభించగలదు ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది సాహసముతోకూడిన వ్యవహారాలు కొంతవరకు లభిస్తాయి స్వల్ప అనారోగ్యం చేస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. శుభకార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు.

—మహేష్ ●




**జ రి గి న క థ**

జీవితంమీద విరక్తితో ఆత్మహత్య చేసుకో బోతున్న రాధను, రక్షిస్తాడు ఆ ఊరి డాక్టర్ వేణు. వేణుకు తన దయనీయ జీవితగాథనంతా వినిపిస్తుంది. రాధ చిన్నతనంలోనే తండ్రిని కోల్పోతుంది. స్కూలు ఫైనలు ప్యాసయిన రాధను ఒక మంచి సంబంధమే అనుకుని, భాస్కరానికిచ్చి పెళ్ళి చేస్తాడు అన్న ప్రకాశరావు. అనుకోని విధంగా ఒక ప్రమాదంలో భాస్కరం మరణిస్తాడు. రాధకు అన్నగారింట్లో కూడా ఆదరణ కరువవుతుంది. కూతురిని గురించిన బెంగతోనే తల్లి శాంతమ్మ ప్రాణాలు విడుస్తుంది. ఆంజనేయులు రాధపై అభాండాలను సృష్టిస్తాడు. రాధను తనవెంట తీసికెళ్ళి ఉద్యోగం యిప్పిస్తానని ఊరడిస్తుంది పార్వతి. వేణు తనను వివాహం చేసుకోమని కోరిన సంగతి పార్వతికి చెప్తుంది రాధ. క్షణికోద్రేకానికిలోనై హద్దుల నతిక్రమిస్తారు రాధ, వేణు. భయపడాల్సిన అవసరంలేదనీ, తా నామెను తప్పక వివాహం చేసుకుంటానని చెప్తాడు వేణు. వేణు వద్దనుంచి ఉత్తరం రాలేదని రాధ కలవర పడుతున్న సమయంలో, అతని ఉత్తరం ఆంజనేయులు చేతిలో పడుతుంది.

## 9

అంతకు నాలుగురోజుల క్రిందటే ప్రకాశరావు కుటుంబం, ఆంజనేయులు, వాళ్ళ వూళ్ళో ఆస్థివ్యవహారాలన్నీ పరిష్కరించుకుని తిరిగి వచ్చారు.

ఒకవారం రోజులు గడిచిపోయాయి. రాధలో ఆరాటం ఆవేదన ఎక్కువయ్యాయి. "వారంరోజులలో వస్తానని చెప్పివెళ్ళారు. పదిహేనురోజులు గడిచి పోయాయి. ఆయన తిరిగిరాలేదు. పోనీ వుత్తరం అయినా వ్రాయలేదు. వాళ్ళమ్మగారు సమ్మతించలేదేమో? నిజమే ఏతల్లిమాత్రం తనకొడుకు నాలాంటి దౌర్భాగ్యురాల్ని పెళ్లిచేసుకోడానికి యిష్టపడుతుంది.

నేనెంత దురాశకు పోయాను. ఆవేశంలో వళ్ళు తెలియకుండా ప్రవర్తించాను. నేనువేసిన తప్పటడుగు నామొఖాన్నే యింత మసిపూయబోతోంది. భగవాన్! నేనెవరికీ చెప్పుకోను. ఇంకా నాలుగురోజులు పోతే యింట్లో అంతా పసిగడతారు. నా బ్రతుకు నడిరోడ్డుమీదికి రాకముందే నేనేదైనా మార్గం వెతుక్కోవాలి. ఏమిటామార్గం? పోనీ చచ్చిపోతే?

లేదు లేదు. వారింత అన్యాయానికి ఒడిగట్టరు. నమ్మించి మోసంచేసే దుర్బుద్ధేశం వారికి లేదు. ఏకారణంచేతనో వుత్తరం వ్రాయలేక పోయారు. కొద్ది రోజులు వోపిక పడితే తప్పకవస్తారు. కాని, యీలోగా నేను పలుగురిలో తలెత్తుకుని ఎలా తిరగ్గలను." అనుకుంటూ తనలో తనే కుమిలిపోసాగింది రాధ.

తనని ప్రతిక్షణం నీడలా వెన్నంటి తిరుగుతూ మరోవ్యక్తి తన చర్యల నన్నింటినీ గమనిస్తున్నాడని ఆమెకి తెలియదు.

* * *

ఉదయం పదిగంటలయింది. జ్యేష్ఠమాసపు ఎండ అప్పుడే చుర్రుమనిపిస్తోంది. ఆవాళ ఆదివారం కావడంచేత ప్రకాశం తీరుబడిగా పేపరు చదువుకుంటూ వీధి వరండాలో కూర్చున్నాడు. గేటుతీసిన చప్పుడయి తలెత్తి చూశాడు. వో అపరిచితవ్యక్తి దగ్గరగావచ్చి,

"ప్రకాశరావుగారున్నారా"? అన్నాడు సన్నని చిరునవ్వు పెదవులమీద తొణికిసలాడుతూండగా.

"నేనే, ఏంకావాలి". అన్నాడు ప్రకాశం ఆగంతకుడిని నఖశిఖపర్యంతం పరీక్షగా చూస్తూ.

మంచిబలమైన శరీరసౌష్ఠవం పొడుగాటి కొనదేలిన ముక్కు, పెద్దకళ్ళు, విశాల ఫాలభాగం, గంభీరమైన కంఠస్వరం, ఖరీదైన దుస్తులు, నడకలో మాటలో శరీరపు ప్రతికదలికలో ప్రస్ఫుట మౌతున్న ఠీవి, అభిజాత్యపులాలిత్యం. ప్రకాశం కళ్ళు మరల్చుకోలేక పోయాడు.

తనని అంత ఆశ్చర్యంగా పరీక్షగా వీక్షిస్తున్న వ్యక్తితో ఎలాసంభాషణ మొదలు పెట్టాలో తెలియక ఇబ్బంది పడ్డాడు వేణు.

ఇంతలో ప్రకాశమే తేరుకుని, "ఇలా కూర్చోండి" అంటూ కుర్చీచూపించాడు.

"నాపేరు వేణుగోపాలరావు. ఇక్కడ గవర్నమెంటు అస్పత్రిలో డాక్టర్ని." అంటూ సంభాషణ మొదలుపెట్టి ఇటూ అటూ పరికించి చూశాడు రాధ కోసం.

ప్రకాశం మౌనంగా తిలకించడమేతప్ప ఎలాంటి ప్రసంగం చెయ్యలేదు.

"ఇదేమంత పెద్దయిల్లుకాదే. నేను నేనువచ్చినసంగతి యింకా రాధకితెలియక పోవడానికి. అయినా లోపలెక్కడో పని చేసుకుంటోందేమో. పోనీ రాధరాకపోతే మాత్రం నాపేరుచెప్పాకయినా ఈ పెద్దమనిషి గ్రహించుకోడేం? అసలు నాఫోటోచూసి వుంటే నన్ను చూడగానే గుర్తుపడతా డనుకున్నాను. రాధ వీళ్ళకింకా ఏమీ చెప్పలేదేమో. ఇంకా నామీద అపనమ్మకమేనా"? అనుకుంటూ.

"రాధ మీ కేమీ చెప్పలేదా"? అన్నాడు అప్పుడే గుమ్మంఅవతలనుండి చూస్తున్న చీరకొంగువంక ఆత్రంగాచూస్తూ.

అతనిమాట ఇంకా పూర్తి అయ్యీకాక ముందే ఆచీరకొంగు అపర కాళికావతారం దాల్చి...

"ఇలా ఎంతమందికి మాటచ్చిందినాయనా ఆమహాతల్లి. నేను మొత్తుకుంటూనేవున్నాను ఆడదానికా తిరుగుళ్ళు పనికిరావంటే అని. ఈయన వింటేనా? చెల్లెలు చెల్లెలని ముద్దుచేసి నెత్తి నెక్కించుకున్నందుకు బాగా శాస్తి చేసింది." అందిగుమ్మం ఇవతలికి వచ్చి.

ఆవిడ ప్రకాశరావుభార్య కామాక్షిగా గ్రహించుకున్నాడువేణు. కాని ఆవిడమాటలు

మాత్రం [illegible]

"మీరుచెప్పన్నదేమిటో నాకు తెలియు డంలేదు. ఇందులో తప్పేంవుంది? మేమిద్ద రం వివాహంచేసుకోడానికి మాఅమ్మగారు కూడా అంగీకరించారు. ముందే మీకు చెప్దామనుకున్నాను, కాని అమ్మ అనుమతి తీసుకున్నాక చెప్పడం మంచిదని రాధే వారిం చింది. ఆమెమళ్లీ వివాహం చేసుకుంటే మీకేమిటి అభ్యంతరం"? అన్నాడు మార్చి మార్చి ప్రకాశరావునీ, కామాక్షి నిచూస్తూ.

కామాక్షి ఏదోసమాధానం చెప్పబో తూంటే, "నువ్వుండు". అంటూ ఆమెని వారించి, "అసలు జరిగిందేమిటో విశదంగా చెప్పండి. మారాధ మీకెలా తెలుసు?" అన్నాడు ప్రకాశం.

[illegible] తిస్తే తనకేటువంటి అభ్యంతరం వుండ దనీ, మిమ్మల్ని కూడ ఒప్పించగలవనీ చెప్పింది. వెంటనే వెళ్లలేక పోయాను. ఇరవైరోజుల క్రిందట శలవు తీసుకుని మావూరు వెళ్లాను. నేను వెళ్లేదాకా తరచు మేమిద్దరం కలుసుకుంటూండే వాళ్లం. నా ప్రయాణానికి ముందు రోజూ కూడ తనని కలుసుకున్నాను.

ఇంటికివెళ్లాను. అమ్మ అనుమతీ ఆశీ ర్వాదం తీసుకున్నాను. రెక్కలు కట్టు కుని ఇక్కడ వాలి మీకు, రాధకి ఆ శుభ వార్త అందజేయాలని, రాధని తీసుకెళ్లి అమ్మకి చూపించాలని ఉవ్విళ్లూరాను. కానినేను దురదృష్టవంతుడిని. హఠాత్తుగా

[illegible] కూడ ప్రాణాలు." అన్నాడు ప్రకాశ రావు వంక చూస్తూ.

"అంటే పదిరోజుల క్రిందటే రాధ కావుత్తరం అంది వుండాలి. మరిలా ఎం దుకు చేసిందో." అన్నాడు ప్రకాశం తలొంచుకుని.

"ఏం చేసింది"? అన్నాడువేణు - ఆదు ర్దాగా. అసలింతవరకు రాధ కనిపించక పోవడంతో అతని హృదయం ఏదో కీడుని శంకిస్తోంది.

ప్రకాశం ఒక్కసారి తలెత్తి వేణువంక చూసి మళ్లీ తలదించుచేసుకున్నాడు. ఎలా చెప్పాలో ఏం చెప్పాలో అతనికి తోచడం లేదు.

"మీరలా నానుస్తూ కూర్చుంటే



"మీయింటి వ్యవహారాల్ని విమర్శిస్తున్నా నని మీరు ఏమీ అనుకోవద్దు. మీరే అడుగుతున్నారు కాబట్టిచెప్పవలసివస్తోంది.

మూడు నాలుగు నెలల్క్రిందట ఓ సాయంత్రం ఆమె ఆత్మహత్య చేసుకోడానికి బయలుదేరింది. దైవకృపవల్ల ఆసమ యానికి అక్కడేవున్న నేను ఆమెని ఆఖరి క్షణంలో మృత్యుముఖంనుండి రక్షించ గలిగాను. అతి బలవంతంమీద ఆమె విషాదగాథంతా నాకు చెప్పింది. తనంటే జాలీసానుభూతితో పాటు, అభిమానం అను రాగం కూడ కలిగాయి నాలో. నన్నువివాహం చేసుకోడానికి అంగీకరించమని అడిగాను. మొదట ఇష్టపడలేదు. కాని నేనుబలవం

అమ్మకి జబ్బుచేసి వారంరోజులు మంచం మీద వుండి శాశ్వతంగా వెళ్లిపోయింది. గతస్మృతుల పునశ్చరణతో అతని హృద యం ఆర్ద్రమయింది. కళ్లు చెమ్మగి ల్లాయి, కంఠం గాద్గదికమయింది.

వింటున్న ప్రకాశరావు మొఖంలో కూడ బాధా వీచికలు అలలుగా లేచాయి. సానుభూతితోవేణుని పరికించడం తప్ప మరేం చెయ్యలేక పోయాడు.

కొద్దిక్షణాలలో తేరుకుని మళ్లీ మొదలు పెట్టాడు, "ఇలా జరిగిందనీ, కర్మ కాండంతాపూర్తయింతరువాత నేనిక్క డికి వస్తానని, తనకేమీ భయంలేదనీ, అమ్మపోయిన మరునాడు నేను రాధకి వుత్త

అతనికెలా తెలుస్తుంది"? అంటూ విసుక్కుని, "నేను చెప్తానుండండి. తనా వేళ చచ్చిపోదామనుకోడానికి కారణం మీతో ఏంచెప్పిందోకాని, అసలుసంగతి ఆ అమ్మాయి గుణంమంచిదికాదు.ఏదో నాకూతురులాంటిదేనని నేను కడుపులో పెట్టుకుని అని విధాలచూస్తుంటే నేను విషం అయిపోయాను. తన తిరుగుళ్లకి స్వేచ్ఛకి నేనడ్డు వస్తున్నానని నామీద విరుచుకు పడేది. అయినా తనకి పెళ్లి చేసుకోవాలనుంటే ధైర్యంగా అన్నగారికి చెప్పుకోవచ్చుగా. ఈ వెధవదొంగ బతుకు కంటె అదేనయం.

"ఏదైనా వుద్యోగం - వెంయింతి - ప్రయో

# నిరీక్షణ

జకుడిని చేద్దామని మాతమ్ముడిని తీసుకొచ్చాను. వాడిని బుట్టలో వేసుకోవాలని చూసింది. తనని పెళ్లిచేసుకోమని అడిగిందిటకూడ ఒసారి. కాని వాడులొంగలేదు.

"ఈ ప్రక్క వాటాలో వుంటూ వుండే మేష్టారికి తను వ్రాసిన వుత్తరం మా తమ్ముడిచేతులోపడేసరికి నానా గొడవా చేసింది. అయినా పోనీ ఏదో తెలియక వ్రాసింది ఇంకనైనా బుద్ధిగా వుంటుందను కున్నాం.

"మీహోదాడబ్బు చూసి మీతోకూడ స్నేహం చేసిందికాబోలు. అయినా నిజంగా పెళ్లిచేసుకునే మనిషయితే మీరు వుత్తరం వ్రాశాకయినా మిమ్మల్ని నమ్మివుండొచ్చుగా.

"ఏం దుర్బుద్ధి పుట్టిందోనాయనా మాతమ్ముడు వుత్తవెర్రివాడు, అమాయకుడు. వాడ్నిమాయచేసి బుట్టలో వేసుకుని వాడ్ని తీసుకుని మొన్నరాత్రి వెళ్లిపోయింది." అంది తమ్ముడిని తలుచుకుని రాగాలు పెడుతూ.

"అబద్ధం. నేననమ్మను రాధ అలాంటిదికాదు" అన్నాడు వేణు కట్టలు తెంచుకున్న ఆగ్రహావేశాలతో.

"ప్రత్యక్షంగా కనిపిస్తున్న దానికి నిదర్శనాలు నమ్మకాలు ఎందుకునాయనా. ఆపోయేవాళ్లు వూరికే పోయారా? నాలుగువేల రూపాయలు పట్టుకు పోయారు. ఇక్కడేదైనా పొలంకొందామని నాపుట్టింటి ఆస్తిఅమ్మి తీసుకొచ్చిన డబ్బునాయనా అది. పొలంబేరంచేసి అవే బ్యాంకులోంచి తీశారు. మర్నాడు ఇచ్చి రిజిష్టరు చెయ్యిచ్చువని. అదిపట్టుకు పోయారు. మానాన్న కష్టార్జితం ఆడబ్బు. అన్యాయంగాతీసుకు పోయింది. అదిబాగుపడదు. వావుసురు దానికి తగులుతుంది........" అంటూ ఇంకాఏదో అనబోతూంటే

"అబ్బ. ఇంక చాలిస్తావా?" అన్నాడు ప్రకాశం విసుగ్గా.

"అయ్యోరాత. ఇంటికింత అప్రతిష్ట తెచ్చిన చెల్లెలిమీద యింకా అభిమానమే" అంది మెటికలు విరుచుకుంటూ కామాక్షి.

ఇంక యింట్లోకి వెళ్లిపొమ్మన్నట్లు సైగ్గచేశాడు ప్రకాశం. ఆమె అదేమీ లక్ష్యపెట్టకుండా.

"పూర్తిగా చెప్పనివ్వండి" అంటూ

"చూడునాయనా. వాతమ్ముడిలాంటి వాడివి నీతో చెప్తే తప్పేం లేదు.

మేమూ సామాన్య సంసారులమేనని తలచెడి ఇంట్లోవున్నఆడబడుచుని మేము మాత్రం ఎన్నాళ్లని పోషించగలం. వాళ్ళ అత్తవారికి కట్టుకుపోయేంత ఆస్థి వుంది. వెళ్లి అక్కడేవుండమంటే పనికివచ్చింది కాదు. అనునుమరి ఈ ఆటలన్నీఅక్కడ సాగుతాయా పోనీ మాతోపాటే వుంటుందనుకున్నాం. కానిమనిషిబ్రతకడానికి డబ్బు కావాలికదా వాళ్లేదైనా మనోవర్తి ఇస్తారేమోనని మధ్య వర్తి ద్వారా ఖబురు చేశాం. మొదట ఏమీ ఇవ్వమన్నారు. చివరికి పాపం కోర్టుకి వెళ్లక్కర్లేకుండా ఆ మధ్యవర్తే ఆరునెలలు తంటాలుపడి వ్యవహారం పరిష్కారం చేసుకొచ్చాడు. సరిగ్గా నిన్నమధ్యాహ్నం వాళ్లబావగారు ఈ మధ్యవర్తి ఎనిమిది వేలరూపాయలు పట్టుకుని ఈవూరు వచ్చారు, ఆడబ్బు ఇచ్చి, వాళ్ళ ఆస్థి వ్యవహారాలలో ఈవిడకేమీ సంబంధం లేదని వ్రాయించి పుచ్చుకోడానికి

"వాళ్లు బస్సుదిగగానే తెలిసిందిఈ సంగతి. ఔను మరిప్రొద్దున్నే వూరంతా గుప్పుమంది. మేందాచుకోవాలంటేమాత్రం దాగుతుందా. అయినా విషయం మానోటి నుండే వినాలని వచ్చారు వాళ్లు. వాళ్లను చూడగానే ఈయన నోటంట మాట రాలేదు. అక్కడికీ నేనే ధైర్యం చేసి మా బంధువుల వూరెళ్లిందని ఆడబ్బు ఈయనకిచ్చి సంతకం పుచ్చుకోమనీ చెప్పాను. ఆడబిడ్డ తెలివితక్కువపని చేస్తే మాత్రం ఆమాత్రమైనా కమ్ముకోవద్దా. అపశంగా ఆపెద్దమనుష్యులిద్దరూ కలిపి మమ్మల్ని నానా మాటలూ అని మొఖం మీద వుమ్మేశారనుకో.

"ఇంకవాళ్లకీ రాధకీ ఏమీ సంబంధ లేదనీ, ఒక్కకానీకూడా వాళ్లదగ్గరనుండి రాదనీ చెప్పేశారు. ఒకవేళ నేం బుద్ధితక్కువ కొద్దీ కోర్టు కెక్కితే—ఇలారాధ ఎవడితోనో లేచిపోయిందని ఈ వూరందరి

చేతసాక్ష్యం ఇప్పిస్తామని చెప్పారు. వాళ్ళు అన్నిమాటలంటున్నా ఈయన దేనికీ సమాధానం చెప్పలేదు. పైగా నానోరు కూడా నొక్కేశారు.'' అంటూ ఆయాసం వచ్చికాబోలు ఒక్కక్షణం ఆగింది.

భార్యనేమీ అనలేక, ఒకవేళ అన్నా ఆ పరాయివాడిముందు తనపరువు యింకా పోతుందని తెలిసిన ప్రకాశరావు సిగ్గుతో అవమానంతో తల వంచుకుకూర్చున్నాడు.

అసలు కామాక్షి చెప్పిందంతా వేణు కర్ణపుటాల్ని సోకిందోలేదో అనుమానమే. అతని మస్తిష్కంలో రాధనిగురించినఆలో చనలే మళ్ళు తిరుగు తున్నాయి.

"ఏమిటిది రాధా! ఎందుకిలాచేశావుఎంత మందిచెప్పినా నేనా విషయం నమ్మలేక పోతున్నాను. ఇందులో ఏదో పొరబాటు వుంది. నీసౌశీల్యంలో నాకు విశ్వాసం వుంది. అదివమ్ముచేయకు.

నాఉత్తరం అందుకుని, మీవాళ్లకి మనసంగతి చెప్పి వాళ్లని కూడ అంగీకరింప జేస్తావని, చిరునవ్వుతోనే నాకు స్వాగతం పలుకుతూ వీధిలోనే ఎదురవుతావని— ఎన్నివూహించుకుంటూ ఈ ఇంట్లోఅడుగు పెట్టాను. నాఆశలన్నీ ఆవిరిలా ఇగిరి పోయాయి. అగ్నికణాలు నాహృదయాన్ని భగభగ మండించేస్తున్నాయి. నేనేంపాపంచేశా వని నాకీశిక్ష! రాధా, ఒక్కసారికనిపించి నీమనస్సులో వున్నదేదో చెప్పు. నీకువేరే వుద్దేశ్యం ఏమైనా వుంటే నేనొక్కనాటికీ అడ్డు రాను.

లేదులేదు. నేనుకూడ పొరబాటుగా ఆలో చిస్తున్నాను. నువ్వు తప్పుదారిత్రొక్కేనీచు రాలివికావు. ఆంజనేయులు ప్రవర్తనతో బ్రతుకుమీదే రోతపుట్టి ప్రాణం తీసుకో డానికి తల పడినన్నువ్వు అతనితో ఎలా వెళ్లగలవు? ఇది నువ్వుబుద్ధిపూర్వకంగా చేసిన పనికాదు. నువ్వొక విషవలయంలో చిక్కుకున్నావు. నావుత్తరం నీచేతిలో పడలేదని తెలుస్తూనేవుంది. అయితేమాత్రం నాలోవిశ్వాసంవుంచి మరి కొద్దిరోజులువేచి వుండకుండా, ఒకనీచుడు దుర్మార్గుడు అల్లిన సాలెగూడులో ఇరుక్కుంటావా?

ఈ ___ బాధలు పడుతున్నావ ఇదా ...



నేనెలా రక్షించుకోగలను? కల్లోలిత మైన మనస్సాగర తరంగాలలో చిక్కువడి, మౌనంగా లేచి, భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి పోయాడువేణు.

వెనుదిరిగి పోతున్న ఆజానుబాహుడైన

# నిరీక్షణ

ఆసుందర గంభీర మూర్తిని చూస్తూ, అతని ప్రక్కనే రాధని వూహించు కుని, "రాధా, ఇంతటి అదృష్టాన్ని దేవి

కోసం కాలదన్ని పోయావు?" అనుకుంటూ బాధగాదీర్ఘంగా నిశ్వసించాడు ప్రకాశరావు. బాధగా మూసుకున్న అతని కళ్ళనుండి అశ్రుకణాలు చెంపలమీదికి జారాయి.

* * *

సరిగ్గా అదేసమయంలో హైదరాబాదులో ఓయింటిలో టెలిఫోను మ్రోగింది. పార్వతి చేతిలో పనివదిలిపెట్టి వెళ్ళి, రిసీవరు ఎత్తి,

"హల్లో" అంది.

........

"అదేమిటిరాధా! నువ్విలా హఠాత్తుగా వచ్చావేమిటి? నీదగ్గరనుండి ఉత్తరం లేదేమిటా అని నేనూ అనుకుంటున్నాను."

"........"

"నీకేం భయంలేదు. నేనిప్పుడే బయలుదేరి వస్తాను. నేనువచ్చిందాకానువ్వక్కడే వుండు. టాక్సీ తీసుకుని త్వరగానేవచ్చేస్తాలే. ఇల్లుగుర్తు చెప్పినా ఈవూళ్ళో కనుక్కోవడం కష్టం." అనిఫోనుపెట్టేసి, "నేనేనిప్పుడే వస్తాను. పాపనిచూస్తూండు." అని పనిమనిషికి చెప్పి గదులు తాళాలు వేసుకుని బయలుదేరిందిపార్వతి.

"ఇప్పుడుచెప్పు. అసలేంజరిగింది?నువ్వు ఇంటినుండి ఎప్పుడు బయలుదేరావు?" అంది పార్వతి, ఇంటికొచ్చింతరువాత రాధ కాఫీ త్రాగుతూంటే.

"చెప్పడానికేముంది. నేనుదురదృష్టవంతురాల్ని పార్వతీ. ఒక్కటీ అనుకున్నటు జరగడంలేదు." అంది రాధ కన్నీళ్ళాపుకుంటూ.

రాధ చెప్పబోయేది పూర్తిగా వినాలని మౌనంగా ఆమె చిన్నబోయిన మొఖంవంక చూస్తూ కూర్చుంది పార్వతి. స్నేహితురాలి రాకలోని అంతరార్థం గ్రహించుకోలేనంత అవివేకికాదు ఆమె.

"ఇంట్లోఎవరికీ చెప్పకుండా, మొన్న రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో ఇంట్లోంచి బయలుదేరాను. ఆవేళప్పుడు స్టేషనుకి వెడితే ట్రైనేదైనా వుంటుందోవుండదో అని బస్సుస్టాండువేపువెళ్ళాను. నాఅదృష్టంకొద్దీ బెజవాడకి ఆఖరిబస్సు బయలుదేరడానికి సిద్ధంగా వుంది. బెజవాడ వచ్చాకనెమ్మదిగా స్టేషను జేరుకున్నాను. అక్కడ వెయిటింగ్‌రూమ్‌లో నిన్నంతా గడిపాను. కొంచెం ఇవతలికి వస్తే తెలిసినవాళ్ళెవరైనా కనిపిస్తారేమోనని, అసలు అన్నయ్యావాళ్ళూ నన్ను వెతుక్కుంటూ అక్కడికి వచ్చారేమోనని ఆగదిలోనుండి ఒక్కసారైనా బయటికి రాకుండా కూర్చున్నాను.

"అసలు నిన్నఉదయమే అక్కడ బయలుదేరుదామనుకున్నాను. కాని ఒక వేళ అది లేటయితే చీకట్లో నేనిబ్బంది పడడం, నిన్ను ఇబ్బందిపెట్టడం అవుతుందని రాత్రిదాకా అక్కడే వుండిపోయాను." అంది చెమర్చినకళ్ళు వత్తుకుంటూ.

"అలా మాటకిముందు కళ్ళంటనీళ్ళు పెట్టుకోకు. ఏంజరిగింది.? వేణుగోపాలరావు వూరికి వెళ్ళివచ్చాడా. వాళ్ళమ్మగారు ఇష్టపడలేదా? అయినా నువ్వు ఇంట్లో చెప్పకుండా ఎందుకొచ్చావు." అంది అనునయంగా.

"వారు వూరికి వెళ్ళి ఇరవైరోజులు పైనే అయింది. వారంరోజులలోనే వచ్చేస్తానన్నారు. రాలేక పోతేవుత్తరం అయినా వ్రాస్తానన్నారు. ఉత్తరమూ లేదు. వారూ లేదు. నాకేమిటో భయం వేస్తోంది" అంది రాధ కన్నీటితో మసగ బారిన కళ్ళతో పార్వతిని చూస్తూ.

"ఛా, ఈమాత్రానికే భయం ఎందుకు వెంటనే వాళ్ళమ్మతో మాట్లాడ్డానికవకాశం కలగ లేదేమో. తనకే ఎటూ ఆలోచనలు పాలుపోని స్థితిలో నీకేం వ్రాయాలో తెలియక వ్రాయలేకపోయి వుంటారు. ఇంకోపదిరోజులు నువ్వక్కడే వుండి చూడాల్సింది. ఇక్కడదికొత్తగా పెట్టిన స్కూలుకదూ అంత ఖంగారేం లేదు నాకీసంగతి ముందుగా వ్రాసుంటే నేనీ సలహా అయినా ఇచ్చివుండేదాన్ని"

"నీకు తెలియదు పార్వతీ నీకెలా చెప్పాలి." అంటూ దోసిట్లో మొఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చిందిరాధ.

(సశేషం)

# భర్తలెట్లా వుండాలి?

**అరిగె రామారావు**



"అయితే మీ వారికీ నీకూ తగు వొచ్చిందా?" తన కుర్చీని సునంద దగ్గరకు లాక్కుంటూ కుతూహలంగా అడిగింది సుజాత.

రేడియో బల్లమీద మోచేయి ఆనించి కుడిచెంపక్రింద అరచేయి పెట్టుకుని దిగాలుమంటూ కూర్చున్న సునంద, సుజాత అడిగిన దానికి నీరసంగా 'వూ' అంది. ఎప్పుడూ ట్రిమ్‌గా అలంకరించుకుని నవ్వుతూ తుళ్ళుతూవుండే సునంద ఏడ్చి ఏడ్చి వుబ్బిపోయిన కళ్లతో రేగిపోయినజుట్టుతో, మాసిపోయిన చీరతో మూర్తీభవించిన శోకం లాగావుంది.

సునంద భుజంమీద చేయివేసి, "మళ్లీ ఏమొచ్చిందే? అసలు తగవెందుకొచ్చింది?" అని సుజాత అడిగింది.

అలా అడుగుతున్న సుజాత కంఠంలో సానుభూతికంటే సరదాయే ఎక్కువగావుంది.

"ఏముంది? నేను వాలుజడ వేసుకోవటం ఆయనకు గిట్టదు. 'పెళ్లయి నాల్గు సంవత్సరాలవుతున్నా పాతిక సంవత్సరాలు పయికొస్తున్నా ఇంకా వాలుజడలేమిటి కాలేజి అమ్మాయిలాగా— ముడేసుకో రాదా!' అంటారు. నీవేచెప్పు—పాతిక సంవత్సరాలకే ముసలిదాన్నయిపోయానా, ముడివేసుకోవటానికి. పెళ్లయి నాల్గేళ్లవుతున్నా పిల్లాపీచూ లేరాయె! కాకపోయినా ఆడాళ్ల విషయా లీయన కెందుకుచెప్పు! వాలుజడలే వేసుకుంటామో, రెండుజడలే వేసుకుంటామో ఈయన కెందుకు?" ఎర్రటి సునంద మొగం కోపంతో మరింత ఎర్రగా అయింది.

"రెండు రోజుల్నుంచి సాగుతున్న ఈ కోల్ వార్‌కు కారణం ఈ స్వల్ప విషయమేనా?"

"ఆ—దీన్తో ఆగితే ఇంక ననుకునేదేముంది? నన్నన్నవాళ్ళ అంతటితో వూరుకోవాలా! మా అమ్మవాళ్లను, అక్కయ్యవాళ్లను కూడ అన్నారు. మా అమ్మ కింత వయసొచ్చినా ఇంకా లోపల లంగా బాడీ వేస్తుందంట. పెద్ద కూతురుకు పెళ్లయి కాపురానికెళ్లినా మా పెద్దక్కయ్య ఇంకా లూజు జడ వేస్తుందంట. ఇలా మా వాళ్లందర్నీ అన్నారే సుజీ!—" పవిట చెంగుతో కళ్లొత్తుకుంటూ ఒక చిన్న రాగానికి శ్రుతి పెట్టింది.

"వాళ్ల వయిపువాళ్లను నీవూ అనక పోయావా? వూరుకున్నావా?"

శ్రుతిలోవున్న రాగం వెంటనే ఆగిపోయింది. సునంద కోపంగా కసిగా అంది. "ఆ—నేనూరుకుంటాననా ? వాళ్లవయిపు వాళ్లందర్నీ వరసకట్టుకనని తెగ దులిపేశాను. ఆయనగారి పెద్దక్కగారు ఆర్గురు బిడ్డలతల్లి ఇప్పుడు బ్రాసరీస్ వేస్తుంది. వాళ్ల చిన్నక్క తలచెడి యింటికివచ్చి తల నున్నగా దువ్వి బర్మా ముడివేస్తుంది. సినిమా పాటలు పాడుతుంది. వాళ్లవాళ్లను అనేసరికి అయ్యగారికి పౌరుషం వచ్చింది. అందరు ఆయనలాగా కారేమో పాపం?"

"అది సరేగాని సుందీ! మీ యింట్లో మీ ఇద్దరూతప్ప ఇంకెవరూ లేరుకదా. మరి స్నానానికి, భోజనానికి, కాఫీకి వాటికి మాట్లాడుకోవాలంటె మరెట్లాగే?" ఉత్సాహంగా అడిగింది సుజాత.

సుజాతవంక అదోమాదిరిగాచూచి సునంద ఇలా అంది.

"ఏముంది? స్నానానికి నీళ్లుపెట్టాను. అన్నంపెట్టాను—అని ఏ గోడకో, ఏఫోటోకో చెప్పినట్లు చెప్తాను. చక్కగా లేచివచ్చి అయ్యగారు అన్ని పనులూ పూర్తి చేసుకుంటారు."

"మరాయన మాటాడవల్సివస్తే—"

"ఇదిగో—"అంటూ నిర్లిప్తంగా రేడియో క్రిందనుండి ఇన్ని చీట్లు సి యిచ్చింది.

సుజాత కుర్చీ అంచుకు జరిగి చీట్లన్నీ ఒక్కొక్కదాన్నే ఎంతో ఆసక్తిగా చదివింది.

1. మా బెర్లిన్ స్లా ఎక్కడుంది? కాస్త తెచ్చి యివ్వగలరా?

2. మూడు రోజులక్రితం తమకు బూట్ పాలిష్ చెయ్యమని విన్నవించుకున్నాం. చేశారా ?

3. ఈరాత్రికి భోంచెయ్యను. రాత్రి యింటికి వచ్చేసరికి బహుశా ఆలిశం కావచ్చు.

.....ఇవన్నీ సునంద భర్త రాసిన స్లిప్స్.

1. అయితే ఈరాత్రికి పోయి ధాజేయ వల్సిన ప లేదుగా?

2. రేపు ఉదయం కాఫీ త్రాగాలను కుంటె సాయంకాలం వచ్చేటప్పుడు కాఫీ పొడి తీసికురాం'— అదే చీటీలో క్రింద ఇలా రాసివుంది 'మొన్న తెచ్చిన ఐదొందల గ్రాంల కాఫీ డి వారానికే అయిపోయిందా?' దీనిక్రింద సునంద మళ్లీ ఇలా రాసింది. 'అవును. మధ్యాహ్నంపూట ఫలహారంగా నేను బొక్కుతున్నాను.'

3. నా బెర్లిన్‌షర్టు ఉతకటానికి ఇక్కడ నౌకర్లెవరూ లేరు. షాపులో వేసు కోండి.

......ఇవన్నీ సునంద రాసిన స్లిప్స్!

ఆ చీట్లన్నింటిని చదివి వరుసగా పెట్టూ, 'వూ—బాగానేవుంది—' అంది సుజాత నవ్వుతూ.

సునంద వేడిగా బరువుగా నిట్టూర్చింది.

సుజాత సునందలు చినన్నాటి స్నేహితు రాళ్ళు. పెళ్లిళ్లయి భర్తలతో కాపురాలు చేస్తున్నారు. అనుకోకుండా గమ్మత్తుగా ఈ వూళ్లో కలిశారు. ఆసందుకి ఈ చివరి యిల్లు సునందది. ఆ చివరి యిల్లు సుజాతది. వాళ్ల భర్తలు కూడా ఒకే ఆఫీసులో పనిచేస్తున్నారు. స్నేహితులు కూడాను. అదీ వీళ్ల మూలంగానే జరిగింది. ఇద్దరికీ పిల్లాపాపలేదు. వెనుకా ముందూ పెద్దదిక్కూ కూడలేదు. భర్తలతో వంటరిగా కాపురాలు చేస్తున్నారు.

మధ్యాహ్నంపూట భోజనాలయిన తర్వాత ఎవరో ఒకరింటివద్ద కలిసి కబుర్లాడుకుంటారు ప్రతిరోజూ. సునంద రెండురోజులనుంచి రాకపోయేసరికి ఆరోజు మధ్యాహ్నం సుజాతే సునంద యింటికొచ్చింది.

"వస్తాను సుందీ! అప్పుడే నాల్గవ్వచ్చింది. మళ్లీ ఆయనగారికి కాఫీ కాచి, వచ్చేసరికి వేడిగా పెట్టి ఉండాలి—" అని సుజాత బయలుదేరింది.

ఇంటికెళ్లి కాఫీ పెట్టాలని వచ్చిన సుజాత యింటికొచ్చి కాఫీ పెట్టకుండా మంచంమీద పడుకుంది. అటు దొర్లింది. ఇటు దొర్లింది. కళ్లు మూసుకుంది. కళ్లు తెరచింది. బరువుగా వేడిగా నిట్టూర్చింది. "అయ్యో నాకంత భాగ్యంకూడానా?" అని అనుకుని వుసూరుమంది.

కొద్దిసేపు ఆమె ఆలోచనలు తీయగా సాగాయి.

దాంపత్య జీవితంలో మధ్య మధ్యలో ఇలాటి బుల్లి బుల్లి తగాదాలొస్తే ఎంత బాగుంటుంది? గిలి కజ్జాలు పెట్టుకుంటే ఎంత సరదాగా ఉంటుంది? భార్యా భర్తలు ఒకరిమీద ఒకరు యుద్ధం ప్రకటించుకుని మూతులు ముడ్చుకుని ముక్కులు విరుచుకుని గోడలతో, గోడనున్న పటాలతో మాట్లాడుతూ స్లిప్స్‌తో సంభాషణలుజరుపుకుంటూ, ఇంట్లో ఒకళ్లకొకళ్లు ఎదురు పడ్డప్పుడు ఎర్రగా చూచుకుంటూ తలలు విదిలించుకుంటూ సూటీపోటీ మాటలను కుంటూ వో రెండు మూడు రోజులపాటు ఎడమొగం పెడమొగంగా గడిపి ఆతర్వాత సంధి చేసుకుని కలిసే క్షణాలెంత మధురంగా ఉంటాయి......

ఆమె తీపి ఆలోచనా ప్రవాహంలో వుండి వుండి ఒక చేదుజాలు రేగింది.

తన పెళ్లయి మూడు సంవత్సరాలవుతున్నా ఇంతవరకూ ఏ ఒక్కనాడూ తమిద్దరి మధ్యన ఎలాటి తగాదా రాలేదు. ఇలాంటి మధుర సన్నివేశం ఏ ఒక్కటీ తనీ మూడు సంవత్సరాల దాంపత్య జీవితంలో జరగలేదు. ఆయనొక శాంతమూర్తి! ఎంత కోపం వచ్చినా నవ్వి వూరుకుంటారేగాని ఒక్కసారయినా కసరి ఎరుగరు. భార్యా భర్తల మధ్య వచ్చే తగాదాలు వాళ్లదగ్గరా వీళ్లదగ్గరా వినటమేగాని తనకేనాడు అనుభవంలోకి రాలేదు...

సుజాత ఆలోచనలో ఇలా తీయతీయగా చేదు చేదుగా సాగుతున్న సమయంలో ఆమె భర్త రామారావు ఆఫీసు నుండి యింటికొచ్చాడు. భర్తను చూడగానే సుజాత కొక వింత ఆలోచన వచ్చింది ఆ శాంతమూర్తి అయిన తన భర్త సహనాన్ని పరీక్షించాలనుకుంది.

రామారావు బట్టలు మార్చుకుంటూ, "ఏం సుజీ! పడుకున్నావు? వంట్లో బాగో లేదా?" అని అడిగాడు.

సుజాత మాటాడలేదు.

రామారావు దొడ్లోకెళ్లి స్నానంచేసి వచ్చాడు.

"కాఫీ ఉన్నాయా సుజీ!" అని అడిగాడు.

సుజాత భర్తవంక కొరకొరాచూస్తూ, "కాఫీలేవ్ గీఫీలేవ్! ఒక్కదాన్నే ఈ యింటి చాకిరంతా చేయలేక చస్తున్నాను. మీ అమ్మగార్ని పిలిపించుకోండి. లేకపోతే వో వంట మనిషిని పెట్టుకోండి. అంతేగాని నేను మాత్రం ఈ బండ చాకిరి చేసేదిలేదు—" అంది.

ఎప్పుడూ లేనిది ఈరకంగా మాటాడుతున్న భార్యవంక రామారావు విస్తుబోతూ చూశాడు.

"నీవు రెస్ట్ తీసికో అమ్మలూ! నేను హొటల్లో త్రాగుతాలే!" అని మెల్లగాం అన్నాడు.

"అలాగే భోజనం కూడ చేసి రాండి. వంటచేసే వోపిక నాకులేదు—" అనిగట్టిగా అంది.

"అలాగే! పనిమనిషిచేత కారియర్ తెప్పిద్దాం. ఇద్దరూ భోంచేయవచ్చును" అని బట్ట లేసుకుని బయటి కెళ్లాడు.

బయటి కెళ్లుతున్న భర్తనుచూస్తూ అలాగే నిస్తేజంగా పండుకుంది సుజాత.

మర్నాటి సాయింత్రం నాల్గు గంటల ప్రాంతంలో సునంద సుడిగాలిలాగా వచ్చింది. మంచంమీదా బోర్లా పండుకున్న సుజాత వీపుమీద ఒక దెబ్బకొట్టి, "లేలే—పొద్దు గూకొస్తోంటే ఇంకా నిద్రేమిటి!" అని లొడలొడా మాటాడేస్తూ యిల్లంతా బొంగరంలాగా తిర్గింది. ఒక కుర్చీని తీసి కెళ్లి దొడ్లో సన్నజాజి పందిరిక్రిందవేసి దానిమీదనెక్కి పూలన్నీ కోసుకుని వడిలో పోసుకుంది.

# భర్తలెలా ఉండాలి?

“ఇకపద—” అంటూ హడావుడిగా వెళ్లి పోబోతున్న సునందతో, “ఏమిటాదూకుడు? కాస్త గుర్రాన్ని కట్టేయ్—” అంది సుజాత.

“టైంలేదు. సినిమా టైం అయిపో తుంది.”—వడిలో నిప్పూలను దోసిట్లోకి తీసి కుని వాసనచూచి మళ్లీ వడిలోకి పోసు కుంటూ అంది.

“యుద్ధ విరమణ జరిగిందా!? సంధి కుదిరిందా?”

“వో—” అంటూ దీర్ఘం తీసింది సునంద.

“ఎప్పుడు? ఎలా?” ఆదుర్దాగా అడి గింది సుజాత.

“రాత్రి ఆయనేవచ్చి ‘సరే నీ ఇష్టం వచ్చి నట్లే జడ వేసుకో’మన్నారు. ఈరోజు ఫస్టు షోకెళ్లుతున్నాం—” అనిచెప్పి సునంద వెళ్లిపోయింది.

సుజాత దిగాలుపడి కూర్చుంది. సునంద ఎంత అదృష్టవంతురాలో అనుకుంది.

ఇంతలో పనిమనిషి రామి విసురుగావచ్చి, “అంట్లేయ్యండి అమ్మగోరు” అంది.

సుజాత లేచి దాని కంట్లు పడేసింది.

“దొంగసచ్చినోడు—ఈడు సచ్చినా నేను ముండమోసేదిలేదు. అమ్మో అమ్మో ఎన్ని దెబ్బలుకొట్టాడు! ఎన్నిదెబ్బలుకొట్టాడు. ఈడి సేయి సెట్టయిపోను. గండు మొగ మోడు. అసలీడు నా కొద్దే అంటే మాఅమ్మ పచ్చింది నన్నేసికట్టి సచ్చింది—” రామి అంట్లు తోముతూ ఇలా కటిక తిట్లు తిట్టుతుంది.

సుజాత దొడ్లోకివచ్చి రోటిమీద కూర్చుంటూ, “ఎవర్నే అలా కటికతిట్లు తిట్టుతున్నావు?” అని అడిగిం .

“ ౼కెవ ప౼ ౼. ఆ౼—ఆ సచ్చినోడు మా యింటోడమ్మగోరు. చూడండమ్మ గోరు! వళ్లంతా కములు కట్టేట్లు ఎట్టా సావబాదిండో—” అంది ముక్కు చీదేసుకుంటూ.

“ఎందుకు కొట్టాడే? నీవేమంటే కొట్టాడే”

“ఉత్తపున్నేనికే కొట్టాడమ్మగోరు. రేతిరి చెంబుట్టాసుకొచ్చాడు. ఏడకెళ్లావ్? దేనికాడ కెళ్లావ్ అని అడిగా. అంతే—పట్టుకుని తెగ ఉతికాడు—” అంది రామి.

“ రీ నీ దుంపతెగ. వాడికి ఎవతైనా ఉందా ఏంటి?” అంది నవ్వుతూ సుజాత.

“ఎవతీ లేదమ్మగోరు! మళ్లీ దేనొంకా కన్నెత్తి సూడడు. నేనంటె పడిసస్తాడు!” ఆమాట అంటుంటే దాని కళ్లల్లో ఏదో వెలుగు తళుకుమంది.

“మరి నీ వా మాట ఎందుకన్నావే?”

“సరదా కన్నానమ్మగోరు. వూరికే వుడికిత్తానికి—” ముసి ముసిగా నవ్వుతూ అంది.

“అయితే వాడూ సరదాకి కొట్టేఉంటాడు. ఇద్దరి సరదా తీరిందిగా—” అంటూ సుజాత లోపలి కెళ్లిపోయింది.

“అదు సావకొట్టినా సరదాగానే ఉంటుంది” రామి మెల్లగా తనలో తాను అనుకోవటం సుజాత వంటింట్లో కాఫీ కలుపుతూ విన్నది.

పనంతా అవజేసి సుజాత పెట్టిన అన్నం గిన్నెను పమిట చెంగుకింద పెట్టుకుంటూ “మీరాదుర్ట వంతులమ్మగోరు! సిన్నబాబు గోరు మిమ్మలెప్పుడూ పన్నెత్తు మాట కూడ అనరు”—అంది.

“అయ్యో నా అదృష్టమే చెప్పు—” అని తనలో తా ననుకుని గట్టిగా నిట్టూర్చింది సుజాత.

స్నానమదీచేసి అద్దంముందు కూర్చుని జడేసుకోబోతున్న సుజాత మనస్సులో ఒక ఆలోచన సన్నగా మెదిలింది. ఎలాగయినాసరే తన భర్తకి కోపం తెప్పించి పోట్లాట పెట్టు కుని హో రెండు మూడు రోజులుపాటు మాటలు లేకుండా ఉండాలి. అవసరమయితే తన్నులుతిన్నా ఫర్వాలేదు. ఎలాగైనా ఈరోజు ఆయనకు కోపం తెప్పించాలి. ఎలా? సుజాత కొక ఆలోచన తట్టింది. గబ గబా లేచి పక్కింటి పిన్నిగారింటి కెళ్లి “ఈరోజు ముడి చుట్టుకోవాలనివుంది. కాస్త మీ సవరం పిన్నలూ ఇవ్వండి పిన్నిగారూ!” అని అడిగింది.

ఆమె యిస్తూ నవ్వి, “సి జడ పెద్ద జడే కదమ్మాయి! మళ్లీ ఇంకా సవరం దేనికి?” అని అడిగింది.

“చాల పెద్ద ముడి వేసుకోవాలని—” నవ్వుతూ అని వచ్చింది.

సవరంపెట్టి పిన్నులుగుచ్చి పెద్ద ముడి వేసుకుంది. దానినిండా పూలు పెట్టింది. రూపాయంతబొట్టు పెట్టు కుంది. అద్దంలో చూచుకుంటూ ఇలా అనుకుంది—

‘ఇప్పు డాయన వస్తారు. ఆయనకు తనె ప్పుడూ, లూజుగా జడ వేసుకోవటమే ఇష్టం. ఈ ముడీ, ఈ బొట్టుచూచి ‘ఏమిటే అన తారం? నోట్లో ఒక చుట్ట పెట్టుకుంటె సరి. ఇక అచ్చం అప్పలమ్మలాగా ఉంటావ్’ అని అంటారు.

‘నన్ను అప్పలమ్మా, గిప్పలమ్మా అంటే వూరుకునేదిలేదు—’ అని తను కోపంగా



అంటారండి.

"వూరుకోక ఏం జేస్తావ్?" అని అడుగుతారు.

"నన్ను అప్పలమ్మా అంటే విమ్మల్ని అప్పలయ్యా!" అంటాను.

"అంటావ్—అంటావ్—అంటే నీ వీపు విమానంమోత మోగుతుంది—" అంటారు.

"ఏం ఎందుకు మోగుతుందేం?" తను రెట్టించి అడుగుతుంది.

ఇలా మాటమీద మాట పెరిగి తగు వస్తుంది. అప్పు డిద్దరికీ మాటలుండవు. అప్పుడు ఇద్దరిమధ్యన యుద్ధం......

ఇలా సుజాత తన ప్రూహాలోకంలో ఒక మధుర సన్నివేశాన్నిసృష్టించుకుంటున్న సమయంలో రామారావు ఆఫీసునుండి వచ్చాడు. వచ్చి సుజాత వంక వింతగా చూశాడు. బట్టలు మార్చుకుని లుంగీ కట్టుకుని ఆమె దగ్గర కొచ్చాడు. అతను కోపంతో అన బోయే మాటలను వినటానికి చెవులు రిక్కరించుకునివుంది సుజాత.

సుజాత వెనక్కివచ్చి ఆమె రెండుభుజాలు పట్టుకుని, "చాలా బాగున్నావు అమ్మలూ! నీకు జడకంటె ఇదే బాగుంది. రోజా ఇలా ముడేసుకోరాదూ?" అంటూ ఆమె మెడ మీద పెదాలు ఆనించాడు.

వంకీకివున్న టవల్ భుజాన వేసుకు "నిజంగా చాలాం బాగున్నావు అమ్మలూ", మళ్లీ ఒకసారి అని దొడ్లోకెళ్లాడు.

"కర్మ—" అని సుజాత నుదురు కొట్టుకుంది.

మర్నాడు భర్త టెర్లిన్‌షర్టు కొకదాని పని పట్టించాలని పని కట్టుకుంది సుజాత. ఆ షర్టును రామారావు ఏభై రూపాయలు పెట్టికొన్నాడు. అతనికున్న ఒకే ఒక టెరిన్ షర్టు అది. దాన్ని లాండ్రీకేస్తే వాళ్లు పాడు చేస్తారని ఎప్పుడూ దాన్ని లాండ్రీ కేయడు. సుజాత చేతనే వాష్ చేయిస్తాడు. ఆ షర్టును వుతకమని సుజాతకు ఆరోజు ఉదయమే చెప్పాడు. అతడంత ప్రత్యేకంగా చూచుకుంటున్న ఆ షర్టును ఎలాగయినా పాడుచేసి అతనికి కోపం తెప్పించాలని నిర్ణయించుకుంది సుజాత. తన చీరల్లో రంగు పోయే చీర నొకదాన్ని తీసుకుని ఆ చీరనూ టెర్లిన్‌షర్టును కలిపి సర్ఫ్‌లో పెట్టింది. ఒక అరగంటలో ఆ చీర రంగంతా టెర్లిన్ షర్టుకు చక్కగా పట్టింది. అది చూడగానే సుజాతకు నవ్వు వచ్చింది, ప్రాణం ఉసూరుమంది. ఏభై రూపాయల షర్టు. తనకున్న అవసరానికొద్దీ దాన్ని పాడుజేయక తప్పదు మరి.

సాయంత్రం ఆఫీసునుండి వచ్చిన రామారావు తనెంతో ఇదిగా చూచుకుంటున్న షర్టుకు పట్టిన గతిని చూడగానే ఉసూరుమన్నాడు.

"ఇదేమిటి అమ్మలూ! ఇలా తయారు జేశావ్!" అన్నాడు. "నాచీరతోపాటు పెట్టాను. నాచీరరంగు దిగి కంటుకున్నది" అంది.

"రంగుపోయే చీరతో పెట్టేశావే ఎలాగ అమ్మలూ?" అన్నాడు.

ఫర్వాలేదు. దారికొస్తున్నాడని సంబర పడింది సుజాత.

"అది రంగుపోయే చీరని నాకేం తెల్సు? నేనేం కలగన్నానా?" అని విసురుగా సమాధానం చెప్పింది.

రామారావు ఒకసారి సుజాత మొగంలోకి చూశాడు. మళ్లీ ఏమనుకున్నాడో ఏమో, "పోన్లే సుజీ!" అని లోపలికెళ్లిపోయాడు.

మళ్లీ దెబ్బతిన్న సుజాత నీళ్లు కారిపోయింది—రంగు రంగుల టెర్లిన్‌షర్టు తననిచూచి ఎక్కిరించినట్లనిపించింది.

అయినా సుజాత అధైర్యపడలేదు. ఆమె పట్టుదల ఇంకా పెరిగింది. మర్నాడుదయం మరో సంఘటన్ని కల్పించింది.

ఎవరైనా ఫ్రెండ్సువాళ్లు వచ్చినపుడు వాడవచ్చునని రామారావు ఆమధ్య హైద్రాబాద్ వెళ్లినప్పుడు ఒక ఖరీదైన టీసెట్ తీసికొచ్చాడు. రోజు వారీగా వాట్ని వాడనీయడు. అలమరలోపెట్టి ఉంచుతాడు.

వాట్ని కడగాలని బయటికి తీసి రెండు కప్పులను, ఒక సాసర్ని చేయి జారినట్లు కావాలని చేయి జార్చింది.

అయినా రామారావేం అనలేదు—"చేయి జారిందా? పోన్లే—" అన్నాడు.

ఇక సుజాత ధైర్యం సన్నగిల్లటం మొదలుపెట్టింది. అసలీ మనిషికి ఈజన్మలో కోపమనేది వస్తుందా అని అనుకుంది.

ఆ సాయంత్రం పనిమనిషి రామి క్రొత్త సిల్కుచీర కట్టుకుని ముసి ముసి నవ్వులతో పని చేయటానికొచ్చింది.

"ఏమిటి విశేషం? క్రొత్తచీరకట్టావ్?" అని అడిగింది సుజాత.

"మొన్న కొట్టినదానికి జాల్మైనా. మా మావ కొని తెచ్చాడమ్మగోరూ—" అంది ఎంతో గర్వంగా.

సుజాత మొగమెందుకో చిన్నబోయింది. ఏదో తెలియని దిగులు గుండెలచుట్టూ చేరుకుంది. తనకంటె ఆఖరికి పని మనిషి రామి కూడా ఎంతో అదృష్టవంతురాలనుకుంది. ఇలా అనుకోగానే ఒక విషాదరేఖ ఆమె గబగబా లోపలికి పరుగెత్తింది. ఇక తన జన్మలో ఆయనకు కోపాన్ని తెప్పించలేదు. ఆయనకు కోపమూరాదు. తన ముచ్చటా తీరదు. పోనీ తనంత తాను కోపం జేసుకుందామంటె, అదీ కుదిరేటట్లులేదు. రెండుచేతులూ కలిస్తేగదా చప్పట్లు! ఇద్దరిలో కోపం రేగినప్పుడేకదా సరదా! ఎంత సేపని తనొకర్తీ కోపం తెప్పించుకుని మూతి ముడ్చుకుని కూర్చుంటుంది. ఆయన ముద్దుగా 'అమ్మలూ!' అంటే చాలు ఆ నటిస్తున్న కోపం కాస్త ఎగిరి చక్కా పోతుంది. ఛా ఏమిటో, తన ముచ్చట ఈ జన్మలో తీరేటట్లులేదు. అని నిర్ధారణ చేసుకునేసరికి సుజాతకి అంతులేని దిగులు పట్టుకుంది.

రోజులు గడుస్తున్నకొద్దీ సుజాతకు నిరాశ, నిస్పృహ ఎక్కువయిపోతున్నాయి. ఏదో దిగులు, విరక్తి ఆమెను కృంగదీస్తున్నాయి. రోజు రోజుకీ ఆమె నీరసించిపోతుంది......ఎప్పుడూ ఎడతెగని ఆలోచనలు—అసలు తన భర్త తన నొక వ్యక్తిగా, అర్ధాంగిగా చూడటంలేదు. ప్రతి దానికీ 'అమ్మలూ—అమ్మలూ' అనిపిలుస్తూ ఒక బుల్లి పాపాయిని చూచినట్లు చూస్తున్నాడు. ఏ పని చేసినా కాస్తయినా కసురుకోడు, తిట్టడు. ఏదేదో చిన్న పిల్ల అని సరిపెట్టుకున్నట్లుగా ఉంటుంది ఆయన ప్రవర్తన. ఎంత చిన్న పిల్లలయినా కోపం తెప్పించే పనిచేస్తే విసుక్కుంటాం కదా. ఒక్కొక్కసారి చేయి కూడ చేసుకుంటాంకదా. అదీ లేదు.....అస్సలీయన తనని ప్రేమిస్తున్నాడా అని అనుమానం కూడ కలుగుతుంది. నిజంగా ప్రేమించే వాడయితే కాస్త సరదాగా కోపగించుకోవటం' గిల్లికజ్జాలు పెట్టుకోవటం, అప్పుడప్పుడు చేయి చేసుకోవటం—ఇవన్నీ చేయడేం! ఇలా శాంతంగా వుండటం, ఎలాటి విషయానికయినా చలించకుండా ఉండటం, ఏమి చేసినా ఏమీ అనకపోవటం ఇదంతా తనమీద ప్రేమవుండికాదు— తనని పరాయిదాన్నిగా చూడటం. తనని కేర్‌మని ఇలా ఏడిపించటం దేనికి? తన కిష్టమయిన వాళ్లనే చేసుకుని ఉండవచ్చునుగా.

....ఇలాటి ఆలోచనలో మధ్యన తన భర్తకు తనూ మధ్యన లేని దూరాన్ని వూహించుకుంటూ అతన్నొక పరాయి మనిషిగా చూడటం మొదలు పెట్టింది.

రామారావు, ఇటీవల సుజాతలో కని పిస్తున్న మార్పును గ్రహిస్తూనే ఉన్నాడు. కాని, ఈ లకారణమైన మార్పుకు అతనికి మాత్రం కారణం బోధపడటంలేదు.

రోజు రోజుకీ చిక్కిపోతున్న భార్యను చూచి, "ఏం అమ్మలూ, అలా ఉంటున్నావ్? వంట్లో బాగుండటంలేదా? పోనీ డాక్టరుకు చూపించకూడదు—" అన్నాడు.

"ఏం నాకేదయినా పెద్దరోగం వచ్చి చస్తే ఇంకోదాన్ని కట్టుకుందామను కుంటున్నారా?" అని కస్సున లేచింది సుజాత.

పాపం, రామారావు ఆ మాటకెంతో బాధపడిపోయాడు.

మర్నాడు. మెల్లగా ఇలా అన్నాడు "పోనీ, నాల్గురోజులపాటు మీ వాళ్లదగ్గర ఉండి రాకూడదు."

రామారావు అంటున్న మాట పూర్తి కాకుండానే, "నేను ఉండటం మీకంత కష్టమయితే ఆమాటే తెగేసిచెప్పండి. నాల్గురోజులపాటేం కర్మ శాశ్వితంగానే వెళ్లిపోతాను. ఈ పాడు పీడా మీకు విరగడైపోతుంది—" అంటూ లేచింది.

రామారావు మారు మాటాడకుండా బయటి కెళ్లిపోయాడు.

సుజాత ఎందువల్ల ఇలా మారిపోయిందో ఎంత ఆలోచించినా రామారావు కర్థంకాలేదు. ఆమెకు తనేలాటిలోపమూ చేయలేదు. ఏ విషయములోనూ ఏమీ అనలేదు. మరెందుకని తనంటె ఇంత మండిపోతుంది? ఎందుకని తనకు దూరమవుతూ తన నొక పరాయి వ్యక్తిగా చూస్తూంది.....ఇవి అతడ్ని వేధిస్తోన్న ప్రశ్నలు.

ఒకరోజు సాయంత్రం పార్కులో తన వేదన్ని సునంద భర్తయిన రాజారావు ముందు వెళ్లబోసుకున్నాడు.

"మనం ప్రతి విషయానికి మరీ అంత

కొంత మెత్తగా ఉండకూడదోయ్. వెనుకా ముందు చూడకుండా వాళ్ళు తగుల్నిస్తే చాలు ఇక అసంతటవే చక్కపడుతాయి. మన పద్ధతి అంతేనోయ్!—" అని నవ్వుతూ చెప్పాడు.

## భర్తలెలా వుండాలి?

"ఏం తప్పులేనిదే ఉత్త పుణ్యానికి తప్పనంటావా?" రామారావు అమాయకంగా అడిగాడు.

"నీవు ఏమీ అనకుండానే ఉత్త పుణ్యానికే ఆమె నిన్ను అన్ని మాటలనలేదా?"

రామారావుకూ అంతే అనిపించింది. రాజారావు చెప్పుతున్నదే కరక్టేమో అనిపించింది. ఒక వరుస తగలించి చూద్దాం



అనుకున్నాడు.

*　　　*　　　*

పగలు పన్నెండు గంటలవుతుంది సునంద అప్పుడే భోంచేసి ఏదో పుస్తకం తిరగవేస్తూ కూర్చుంది. వాకిట్లో మనిషి వచ్చిన అలికిడి అయేసరికి తలఎత్తి చూచింది చూచి ఆశ్చర్యంతో మునిగిపోయింది.

ఏడ్చి ఏడ్చి లావుగా వుబ్బిన కండ్లతోనూ, రేగిన జుట్టుతో, మాసిపోయిన చీరతో, చేతిలో ఒక చిన్న సంచితో, మ్లాన వదనంతో వచ్చింది సుజాతేనా?

సునంద లేచి రెండడుగులు ముందుకేసి, 'ఎవరు సుజీ!' అంది.

సుజాత రివ్వునవచ్చి సునందను కౌగలించుకుని భోరు భోరున ఏడ్చింది. సునంద కంగారు పడిపోయింది.

'ఏవిటే? ఎందుకిలా ఏడుస్తున్నావ్? అసలేం జరిగింది?' అని అడిగింది.

వెక్కిళ్ళుపడుతూ సుజాత తన కుడి చెంపను చూపించింది. ఎర్రటి చెంపమీద చేతి అయిదువేళ్ళ గుర్తులు పడ్డాయి. ఎర్రగా కమిలిపోయి, అరిచేత మందాన పొంగి వుంది.

"ఎవరే ఇది? ఎవరు కొట్టారే?" విస్తుబోతూ అడిగింది సునంద.

"ఇంకేవరు? ఆయనే—" అంది రోస్తూ కసిగా......

"ఎవరు మీ ఆయనా?—మీ ఆయన కొట్టాడా?"

"వూ—" అంటూ అక్కడున్న ఒక కుర్చీమీద కూలబడింది.

"మీ ఆయన నిన్ను కొట టమేమిటే? ఇదేం నమ్మే విషయములాగా లేదు. అసలాయనకు ఇంత కోపం వస్తుందా?" మరో కుర్చీలో కూర్చుంటూ సునంద అడిగింది.

"ఆయనగారే కొట్టారు. మరేం పోయేకాలమొచ్చిందో?"

"అసలేం జరిగిందేమిటి?" ఉత్సాహంగా అడిగింది సునంద.

సుజాత మళ్ళీ ఒక ఏడ్పు రాగానికి శ్రుతి పెట్టింది. సన్న సన్నగా ఏడుస్తూ ముక్కు చీదేస్తూ, పమిటి చెంగుతో కళ్ళొత్తుకుంటూ మెటికలు విరుస్తూ సుజాత చెప్పిన విషయానికి సారాంశమిది.

ఈరోజు ఉదయం రామారావు పేపరు కొరకు బజారెళ్ళి తిరిగి వచ్చేసరికి సుజాత ప్రక్కింటివాళ్ళ చిన్న పాపాయిని ఎత్తుకుని ముద్దాడుతూ కూర్చుంది. "పావు గంటలోనే అమ్మవయిపోయావేంటి?" అని రామారావు నవ్వుతూ ఉషారుగాఅన్నాడు. ఆ మాటకు సుజాత భర్త వంక రుస రుసలాడుతూ చూచి, "ఆ మన మొగాల కధే తక్కువ—" అంది రామారావు దానికి, "ఏం, అదేమంత గొప్ప విషయం. నీవు అమ్మవు కాలేవా?" అన్నాడు. ఆ మాటకు సుజాత మెడ ఒక విసురు విసిరి చేతులు తిప్పుతూ, "ఆ—ఈ మూడు సంవత్సరాల నుంచి అయ్యావు. ఇకవుతావు—అంది" అంతటితో రామారావు ఉత్త పుణ్యానికి మీద కొచ్చి చెంప ఫెడేల్‌మనిపించాడు. (ఈమాట నమ్మటానికి వీలులేదు. సుజాత ఇంకా ఏదో అని ఉంటుంది) జుట్టు పట్టుకుని వంగపెట్టి వీపుమీద గుభీగుభీమని గుద్దులు గుద్దేడు.

సుజాత ఏడుస్తూ, వీపు అరచేత్తో సవర దీసుకుంటూ, అంది "వీపు విరిగి పోయేటట్లు చావబాదాడు.....నేనింత వరకు ఎవరి చేతిలోనూ ఒక చిన్నదెబ్బయినా తిని ఎరుగను. పద్దెనిమిదేళ్ళ మాయింట్లో పెరిగానంటే, మా అమ్మగాని నాన్నగాని, అక్కయ్యలుగాని ఒక్క దెబ్బ కొట్టి ఎరుగుదురా? ఈనాటికి ఈయన చేతుల్లో చావు దెబ్బలు తినవల్సివచ్చింది."

సుజాత ఈ మాట అంటుంటే, 'మీ అమ్మ గరిటకాల్చి వాతలుపెట్టిన సంగతి నాకు తెలియదనా' అని లోపల అనుకుంది సునంద. పయికిమాత్రం ఇలా అన్నది "నాకు తెలియదూ, మీవాళ్ళు నిన్నెంత గారాబంగా పెంచింది."

"అవునే? ఎలా పెరిగానో ఏంజేశానో చూడవే.ఈవేళ ఈనాటి గతి పట్టింది. ఈ రాక సుడితో నేనిక సంసారం చేయలేను తల్లీ! అందుకే మా అమ్మవాళ్ళింటికి పోతున్నా. వాళ్ళకు నేనేం బరువా? పువ్వుల్లో పెట్టుకుని చూస్తారు" అంది సుజాత.

"ఏమిటి, ఇప్పుడు మీ వాళ్ళింటికే బయులుదేరావా! ఈ సంచి అదేనా?" ఆశ్చర్యంగా అడిగింది సునంద.

"ఆ—ఈ నరకంలో ఇంకో క్షణమయినా ఉంటానా?" కసిగా అంది సుజాత.

కాసేపు సునంద మవునంగా వుంది. తర్వాత మెల్లగా ఇలా అంది "కాదు సుజీ, నే ననేది—నీవు తొందర పడుతున్నావేమో నని. సంసారంలో ఇలాటివి రావటం చాల సహజం. అసలు ఇలాటి తగాదాలొస్తేనే అందంగా ఉంటుందేమో. ఎప్పుడూ ఒకే మాదిరిగా రొటీన్‌గా ఏమీ వసలేకుండా ఎన్నాళ్ళు చేస్తాం ఈ కాపురాలు! ఇలాటి అందమైన తుఫానులు అప్పుడప్పుడువస్తూ వుంటేనే సరదాగా ఉంటుంది."

(ఈ మాటలన్నీఒకసారి సుజాత అన్నవే!)

"ఈ సరదా చట్టుబండలుగానూ? ఏం సర దామ్మ. పాడు సరదా. మొగుడుచేతిలో చావు దెబ్బలు తినటంకూడ ఒక సరదాయేనా?' సుజాత చేతులు త్రిప్పుతూ అంది. ●



వైజ్ఞానిక గాథావళి-61.
-డాక్టర్-

# అయస్కాంత సమాచారము

## -గిల్బర్టు-




"భూమి పెద్ద అయస్కాంతము కనకనే అయస్కాంతపు ముల్లు ఉత్తర దక్షిణాలకు తిరుగుతుంది" అని 1600 సంవత్సరములో ప్రచురణమైన తన పుస్తకంలో గిల్బర్టు రాశాడు. భూమి గుండ్రంగా ఉన్నది, అని గ్రహించడము ఎంత గొప్పదో భూమి అయస్కాంతమని గ్రహించడమూ అంత గొప్పది. గిల్బర్టు వృత్తి చేత వైద్యుడు. ఎలిజబెత్తు రాణికి చాలా విశ్వాసముతో కొలువుచేశాడు. ఆవిడమీది విశ్వాసముతోనేనా అన్నట్టు ఆమెపోయిన 1603 లోనే తానూ చచ్చిపోయాడు. వైద్యవృత్తిలో లభించిన విరామ కాలంలో గిల్బర్టు అయస్కాంతాలతో సోదా ప్రయోగాలు చేసి 'అయస్కాంత పితామహుడై'నాడు. ఈనాడు అయస్కాంతమును గురించి మనకు తెలిసిన సామాన్య విజ్ఞానమంతా గిల్బర్టు కనుక్కున్నదే. ఆతని కాలానికి అయస్కాంతము ఇనప ముక్కలు చూపిస్తుందనీ, వ్రేలాడదీస్తే 'ఉత్తర దక్షిణాలు చూపిస్తుందనీమాత్రము తెలుసు. వైద్యులు కాంతభస్మానికి ప్రత్యేక గుణాలు ఆరోపించేవారూ, వజ్రముగాని దాని పక్కకితెస్తే అది ఆకర్షణ శక్తిని పోగొట్టుకుంటుందనుకునేవారు. అయస్కాంతపురాయి ఇనప పొడిని రెండు కొసలలో ఎక్కువగా ఆకర్షిస్తుందని తెలుసూ, ఒక కొసతో ఇనపసూదిని వేలాడదీస్తే ఉత్తర దక్షిణాలు చూపిస్తుందని తెలుసు. అంత మాత్రమే.

"వేలాడదీసిన అయస్కాంతము ఉత్తర దక్షిణాలెందుకు చూపించాలి? అయస్కాంతానికీ ఉత్తర దక్షిణాలకీ సంబంధమేమి?" అని గిల్బర్టు జిజ్ఞాసచేశాడు. వ్రేలాడదీసిన అయస్కాంతపు ఉత్తరపు కొస దాని దగ్గరకు మామూలు ఇనపకడ్డీ కొసని తీసికెళ్లితే ఆకర్షిస్తుంది. అలాగే దక్షిణపు కొస కూడా ఇనపకడ్డీ కొసల్ని రెండింటిని కూడా—దేనికి దాన్ని ఆకర్షిస్తుంది. ఇనుము కొసలపట్ల అయస్కాంతము భేదము చెయ్యదు. అయితే, ఇంకొక అయస్కాంతము కొసల పట్లనో? అని సోదా చూశాడు, గిల్బర్టు. రెండు అయస్కాంతాల కొసలను ఉత్తర దక్షిణపుకొసలు అని గుర్తుపెట్టుకున్నాడూ పరీక్షచేశాడు. వ్రేలాడదీసిన అయస్కాంతపు 'ఉత్తరపు కొస' ఇంకొక దాని 'ఉత్తరపు కొస'ను ఆకర్షించక వికర్షించిందీ 'దక్షిణపు కొస'ను ఆకర్షించింది.

అంటే, వేలాడదీసినప్పుడు ఒక అయస్కాంతపు 'ఉత్తరపు కొస'ను ఉత్తరము వైపులాగి పట్టడానికి మన ఉత్తరదిక్కున ఏమున్నదన్నమాట? అన్న ప్రశ్న వేసుకుని గిల్బర్టు ఒక 'అయస్కాంతపు దక్షిణపు కొస' అని సమాధానము చెప్పేడు. యుక్తమేకదా? ఉత్తరపు కొసను—అనగాఉత్తర దిక్కుకి చూపేకొసను ఆకర్షించేది 'దక్షిణపు కొస'యే. కనక భూమికి ఉత్తర దిక్కున మన అయస్కాంతపు దక్షిణ కొస లాంటిదివుండి, ఇక్కడ వేలాడదీసిన అయస్కాంతపు ఉత్తరపుకొసను ఆకర్షిస్తున్నదన్నమాట. అలాగే మన దక్షిణపు దిక్కున అయస్కాంతపు ఉత్తరపు కొసలాంటిది వుండి వేలాడదీసిన కడ్డీ అయస్కాంతపు 'దక్షిణ సూచి కొస'ను ఆకర్షిస్తోంది అన్న మాట.

అయితే 'భూమి అయస్కాంతమనా? మన అయస్కాంతపు రాయిని గోళాకారంగా అరగదీసి పరీక్షిస్తే భూమికున్న ఇతర అయస్కాంత ధర్మాలు తెలుస్తాయా' అని గిల్బర్టు ఈ సమస్యని వెంటబెట్టేడు. పెద్ద అయస్కాంతపు రాయిని గోళాకారంగా మలచి దానిని నిలబెట్టి, అయస్కాంతపు సూదిని ముఖతలముమీద వ్రేలాడేటట్లు పట్టుకున్నాడూ, ముల్లు నిలిచిన జాడను గోళముమీద గీత గీసి గుర్తించాడు. ఇలాగ గోళ ముఖమంతా సర్వేచేస్తే ఆ గోళముమీది రేఖలుపైన ఒక బిందువు ('ధ్రువ') కడా, దిగువన ఇంకొక బిందువు కడా కలిశాయి. భూగోళశాస్త్ర ప్రకారము వీటికి ఉత్తర ధ్రువము అనీ దక్షిణధ్రువము అనీ పేర్లు పెట్టాడు.

అయితే భూ అయస్కాంతపు ధ్రువాలు, భౌగోళపు ఉత్తర దక్షిణ ధ్రువాలేనా? వాటికి వేరా? అన్న ప్రశ్న పుట్టింది. వ్రేలాడదీసిన అయస్కాంతము సరిగ్గా ఉత్తర దక్షిణాలు చూపలేదు. కొంచెం కోణంగా అయితేనేం, పక్కకి తిరిగి నిలిచింది. భూమిలోని అయస్కాంతము సరిగ్గా ఉత్తర దక్షిణాలకు లేదు అన్న

మాట. ఈ వైముఖ్యము భూమిమీద వేర్వేరుచోట్ల కొంత కొంత చొప్పున మారింది. అయితే అయస్కాంతపు ముల్లు క్షితి ముఖానికి సమాంతరం (Horizontal) గా ఉంటుందా ? అదిన్నీ లేదు! వేలాడదీసిన అయస్కాంతపు ముల్లు భూమధ్యరేఖకడ లంబరేఖకు సమకోణంలోనే (అనగా (Horizontal) గా) ఉంటుంది. భూమి ఉత్తర ధ్రువంవైపు పోగా పోగా సూది ఉత్తరపు కొసకు వాలి వాలి, అయస్కాంతిక ఉత్తర ధ్రువప్రదేశము (Magnetic north) నిటారుగా నిలబడివుంటుంది. గిల్బర్టు అరగదీసి చేసిన గోళాకారపు రాతి అయస్కాంతాలమీద చిన్న అయస్కాంతపు ముల్లూ ఇలాగే చేసింది. భూమికి గోళాకారపు నమూనా నిర్మించి, ప్రయోగశాలలోని ఈ నమూనాతో బృహద్గోళ




ధర్మాలను కనిపెట్టిన గిల్బర్టు వైజ్ఞానికసాహసి, మేధావి కాడా? చివరకు తవ గోళాయస్కాంతాలకు ఉత ర దక్షిణకొసలున్నాయని ఎలిజబెత్తుగాణికి చూపడానికి గిల్బర్టు కొయ్య డిప్పలలో ఆ అయస్కాంతగోళాన్ని ఇమిడ్చి, డిప్పలను గోళముగా బిగించి, నీటిలో తేలవేశాడు. ఈ గోళము ఈతగాడు పల్లటీలు కొట్టినట్లు తిరిగి ఉత్తర దక్షిణాలకు అతడు గుర్తుపెట్టిన మచ్చలే తిరిగి నిలిచేటట్లుగా ఆగింది. డాక్టరుగానూ, నమ్మకమైన సరదారుగానూకాక ఇంగ్లాండు దేశపు తొలి వైజ్ఞానికశాస్త్ర రచయితగా గిల్బర్టు కీర్తి గడించాడు. ఆతని పుస్తకమేనట. ఆదేశపు తొట్టతొలి వైజ్ఞానికగ్రంథము. ●

సీరియల్

# ముద్ద మందార



భూపతి

## 2

నిద్రలేచేసరికి లత కుర్చీలో కూచుని ఏదో పుస్తకం తిరగేస్తోంది. ఆల్బమ్‌లాగుంది. వడివడిగా వెళ్ళి లతచేతిలోంచి తీసుకుని "చూణ్ణీయ్" అంటూ పుస్తకం పేజీలు తిరగేశాను. ఆశ్చర్యం !! లత అక్కయ్య ఆర్టిస్టా..... అవన్నీ బొమ్మలే !!

"మీ కవి అర్థంకావులెండి" అంది లత కుర్చీ చేతిమీద కూర్చుంటూ. నా శరీరం అభిమానంతో దహించుకుపోయింది. కుర్చీలోంచి లేచి "నాకేం బొమ్మ లెయ్యడం రాదనుకున్నావా ? యిదిగో. ఈ పుస్తకం చూడు" అని పెయింటింగ్స్ వేసి, ఆల్బముగా కుట్టించిన నా పుస్తకం తెచ్చి యిచ్చాను. లత మొదటి పేజీ తీసి, "అమ్మో రంగుల బొమ్మలు. ఉండండి. మా అక్కకు చూపిస్తాను" అంటూ పరుగెత్తింది. నాక్కావలసినది అదే. ఆనందంతో ఆ ఆర్ట్ బుక్ చూడ నారంభించాను. ప్రతీ బొమ్మ క్రిందా "పి. ఎం" అని పొడిగా రెండక్షరాలు తప్ప ఏమీ లేదు.

పి. ఎం. అవగా సంధ్య—అవగా సాయంత్రము అవగా సంధ్య ....ఆమె పేరు సంధ్య .... లేక సంధ్యారాణి అయ్యుండచ్చు. అయివుండమేమిటి, అయిఉండాలి. పేరు బాగుంది. సంధ్యారాణి. నిజంగా అదే పేరయితే బాగుణ్ణు అనుకున్నాను. లతని వాళ్ళక్క పేరేమిటో అడగాలనిపించినా ధైర్యం చాలక వూరుకున్నాను. ఏవిటో, అదో రకం పిరికితనం.

లతకి చక్కని ఫోటో తీయాలనిపించింది. పెట్లో కెమెరా తీసి టేబుల్ మీద పెట్టి నిరీక్షిస్తూ కూర్చున్నాను. కాస్సేపటికి లత వచ్చి "చాలా బాగున్నాయట. ఇంకా ఏమైనా ఉన్నాయేమో మా అక్క అడగమంది" అంది. నేను మరి కొన్ని బొమ్మలు యిచ్చి పంపాను. అవి పట్టుకుని వెళ్ళి వో పావుగంటకు తిరిగి వచ్చి "చాలా బాగున్నాయట" అంది. అంటూనే టేబుల్‌మీద కెమెరా చూసి "అది ఫోటో తీస్తుంది కదూ. నాకో ఫోటో తియ్యరూ. చాలా చక్కగా నించుంటాగా.

నేను కెమెరా తీసుకుని నిలబడి, "ఏదీ, అయితే చక్కగా నించో" అన్నాను. లత కుర్చీకి ఆనుకుని నిలబడి, "నవ్వనా కొంచెం" అంది. "వూ" అన్నాను. ఫోటోలు తీసి, "రేపు వస్తే యిస్తాను" అని చెప్పాను.

లత రోజూ—రోజస్తమానూ నాయింట్లోనే ఉండేది. లత అక్క మాత్రం రోజూనే ఆఫీసుకు వెళ్ళే వేళ వచ్చి వాళ గుమ్మం దగ్గర విధిగా నిలబడి ఉండేది.

ఆమె నన్ను ప్రేమిస్తోందేమో !

నా శరీరం ఝల్లుమంది.

నేనూ ఆమెను ప్రేమిస్తున్నట్లనిపించింది. ప్రేమ! ఏమిటో ఆ పద ప్రభావం. చూపులలోనే ఆ భావాలు కలుగుతాయి. ఆ పదం ఎంత పవిత్రమో—అంత విచిత్రము. చిత్రం.

మంచంమీద వత్తిగిలి పడుకున్నాను. ఆ సాయంత్రం "ఫోటోలు చాలా బాగున్నాయని మా అక్క అంది" అని లత అన్నప్పుడు "మీ అక్కయ్యకు కూడా తీద్దామా" అనాలనిపించినా అనలేకపోయాను.

ఏమైనా పి. యూం. వి నేను ప్రేమిస్తు న్నాను.

ప్రేమించాను .... ప్రేమ ....

నిద్రలోకి జారిపోయాను.

*  *  *

తెల్లవారింది.

"బాబూ" అన్నాడు రామయ్య. నేను కదలడం చూసి వెళ్ళిపోయాడు. రాత్రి ఆల్బమ్ అలానే తెరిచిఉంది. ఆల్బమ్ దాచేసి, దైవందిన కార్యక్రమాల్లోకి జొరబడ్డాను. దినపత్రిక చూశాను. పేజీలు తిరగేసే ..... లోపల ఒక శీర్షిక నన్నాకర్షించింది.

"అబల మరణం. తనని బలాత్కరించబోయిన వ్యక్తిని చంపి, సింహాచలం అనే పడుచు తన్ను తను పొడుచుకుని చచ్చిపోయింది."

గాఢంగా నిశ్వాసం వదిలాను. ఎవరో పాపం!

పేపరు పక్కకు విసిరేసి, కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకున్నాను. రాత్రి నా మనస్సు గతంలోకి ఎంతవరకూ వెళ్ళి ఆగిందో అక్కడినుంచి మళ్ళీ ప్రారంభించాలని, ఆనాటి మధురస్మృతులనైనా కనీసం మననం చేసుకోవాలనిపించింది. గతం మనోఫలకం మీదికి వచ్చింది.

—మరో మూడ్రోజులయ్యేసరికి లత అక్కయ్యతో మాట్లాడే అవకాశం వచ్చింది. ఆవేళ రామనాధంగారితో వనుండి వాళ్ళింటికి వెళ్ళాను. పనయ్యాక వచ్చేస్తుంటే "అన్నట్లు మువ్వు పెద్ద ఆర్టిస్టువిట గదా, మా మేనగోడలుక్కూడా బొమ్మలువెయ్యడమంటే తగని పిచ్చి. అదేసిన బొమ్మలు చూసి, కొంచెం సలహా ఇవ్వవయ్యా" అని, "లతా.... మీ అక్కన్నమ్మను" అన్నారు. నా గుండెలు దడదడలాడాయి. ఇంతలో లత నా ళ్ళక్కయ్యను ఆమె వేసిన బొమ్మల పుస్తకాలతో సహా తీసుకువచ్చింది. రామనాధంగారు ఆ పుస్తకా లందుకొని, బల్లమీద పెడుతూ, "చూడవయ్యా" అన్నారు. నేను పై పుస్తకాన్ని వోసారి తిరగేసి, "మీరు ఏవైనా చూసివేస్తారా లేక నికరంగా గళ్ళు కట్టివేస్తారా" అన్నాను పెద్ద పరీక్షాధికారిలాగ. ఆమె సమాధానం చెప్పడానికి సిగ్గుపడింది. తరువాత వేలచూపులు చూస్తూ, "నా కవన్నీ తెలీవు. పత్రికల్లో పడిన బొమ్మలు చూసివేస్తాపంతే" అంది. రామనాధంగారు కలగజేసుకుని "ఆ గళ్ళు కట్టడం ఏవిటో నేర్చుకో" అని. ఈలోగా జానకమ్మగారు పిలవడంవల్ల "వచ్చే" అనుకుంటూ వెళ్ళిపోయారు. నే నామెకేసి చూడ్డానికి తల పైకెత్తాను. అంతవరకూ నాకేసి చూస్తున్న ఆమె కళ్ళు సిగ్గుతో నేలకు వాలాయి. నేను గొంతు సవరించుకున్నాను.

"గళ్ళు కట్టివెయ్యడం అనవసరం లెండి, చూసివెయ్యడమే మంచిది. ముందు లతలు, డిజైన్లు వేస్తే చెయ్యి బాగా తిరుగుతుంది." అన్నాను. ఆమె మౌనంగా తలూపింది. నేను కుర్చీలోంచి లేచి "మళ్ళీ కనుపిస్తాను. అన్నట్లు మీపేరేవిటి?" అన్నాను.

"ప్రేమ" అందామె.

నా వళ్ళు ఝల్లుమంది. ఆనక జివ్వుమంది. ప్రేమా!! ఇదేం పేరు? వళ్ళు రుల్లుమనే పేరు అనుకున్నాను. పేరు చాలా బాగుంది. "ప్రేమ" అని సన్నగా ఉచ్చరించాను. ఆమె నవ్వును పెదిమల మీద ఆపుకుంది. ఇంతలో ఇంటాయన రామనాధంగారు వచ్చారు. వస్తూనే, 'ఏం? ఆ గళ్ళేవిటో తెలుసుకున్నావే మువ్వు ..... ఆనక నా ప్రాణం తియ్యక" అన్నారు. ప్రేమ తల వూపింది.

*  *  *

ఇలాగే వో వారం జరిగింది. మరో వారం జరిగి వో నెల దగ్గర దగ్గరగా అయిపోవచ్చింది. ప్రేమతో చాలా చనువుగా మాట్లాడడం, బొమ్మలు గీసినవి చూడడం, తప్పులు చెప్పటం, లెక్కలు ఇంగ్లీషు వంటివి చెప్పడం వంటివి ప్రారంభించాను. "వాసుగారూ యీ పాడు లెక్కెన్నిసార్లు చేసినా రావటంలేదు" అంటూ ప్రేమ వచ్చేసింది. నేను పాట పాడుకుంటుండగా గనుక వస్తే మాట్లాడకుండా పాట విన్న తరువాత "డ్రాయింగులో మీరు గొప్పవారేమోకాని, పాటలో మాత్రం నేనే గొప్ప" అనేది. ఆఫీసుకు శలవు కూడా పెట్టి, ప్రేమతో కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవాలనిపించేది.

మరి కొన్నాళ్ళు జరిగి, వోనాటి దగ్గర ఆగిపోయింది. ప్రేమ, లత—వాళ్ళవూ రెళ్ళిపోతున్నారట. ప్రేమ వచ్చి నాతో చెప్పింది. నా కాళ్ళ క్రింద భూమి కదిలినట్లు అయ్యింది.

"ఏవండీ వాసుగారూ మీకు మేము గురు ఇంటావూ. పెద్ద గవర్నమెంటు ఉద్యోగులు కూడాను మీరు" అంది ప్రేమ వెళ్ళే ముందు వచ్చి. నాకేసి చూసి "ఏమిటలా అయిపోయారు? కోపం వచ్చిందేవిటి సరదా కన్నాను" అంది నా ముఖభావాలు చూసి. నేను ఆ లోకం నుంచి యీ లోకంలోకి వచ్చి "కోపమా! ఎన్నే లేదు. మీకు నేను గుర్తుండినా లేకపోయినా మీరు, మాత్రం నా కెప్పుడూ గురు ఉంటారు. మర్చిపోదామనుకున్నా, మరచిపోయే పేరా మీది?" అన్నాను. ప్రేమ బుగ్గ మీద సిగ్గు దోబూచు లాడింది. నేను పెట్టె తెరిచి కెమేరా తీసి, మీ కభ్యంతరం లేకపోతే ఫొటో తీస్తాను." ఆమె సిగ్గుపడుతూ నాకేసి చూసి "ఇక్కడనే నిలబడనా" అంది. "ఆహా" అంటూ ఆమెకు మూడు ఫోటోలు తీశాను.

ఆ సాయంత్రమే వాళ్ళు వెళ్ళిపోయారు.

*  *  *

ప్రేమ నా హృదయంలో మరింత బలపడింది. ప్రేమను ప్రేమించిన విషయం నాన్నగారితో చెప్పి, పెళ్ళికి అంగీకరించేలా చెయ్యాలి. ప్రేమను పెళ్ళి చేసుకుని తీరాలి. ఏమైనా సరే. ప్రేమే నా సర్వస్వం. నా నిర్ణయాన్ని కర్తవ్యంగా మార్చుకుని బెజవాడ చేరాను. నాన్నగారు ఆఫీసు నుంచి వచ్చేలోగా ఏ పద్ధతిలో మాటాడాలో ఆలోచిస్తూ కూర్చున్నాను. నాన్నగారి వద్ద నాకు చనువు లేనేలేదు. భక్తి ఉందో లేదో తెలియదు గానీ, భయం మాత్రం చాలా ఎక్కువగా ఉండేది.

సాయంత్రం నాన్నగారు వచ్చారు. నన్ను చూసి, "ఏరా! ఎప్పుడొచ్చావు? ఏన్నాళ్ళు



## మంద్రమందార

కలవు పెట్టావు?'' అంటూ కుశల ప్రశ్నలు వేశారు. అప్పటికీ సమాధానం చెప్పాను. కాని, అసలు విషయం ఎలా ప్రసావించాలో తెలియక, గొంతువద్దనే ఆగిపోయింది. ఆమాటకొస్తే, యిలాంటి విషయాలు ఏ కొడుకయినా తండ్రితో చెప్పగలడా ! ఏమో!!

రాత్రి భోజనాలయ్యాక "గోపాల్ పూర్ ఎలా ఉంది? నీళ్లు గట్రా నీకు పడ్డాయా !'' అంటూ మరికొన్ని ప్రశ్నల వేశారు. అనక, "మనదీ ప్రాంతమే! గంజాం జిల్లాలో అస్కాలో మీ అమ్మ పుట్టిందట'' అన్నారు.

నాన్నగారిది చత్రపురమట ! ఎక్కడి వాళ్లు ఎక్కడికి వస్తారో ! జీవనోపాధి మనిషి నలా తరుముతుందేమో! అసలు విషయం మాత్రం నేను కదపలేక పోయాను.

మూడ్రోజు లయ్యాయి.

మేలెడు బట్టలు కుట్టించారు. "జీతం చాలకపోతే నాకు రాయి.'' అన్నారు 'అలాగే నండి' అన్నాను. మర్నాడే నా ప్రయాణం. ఆ రోజంతా వ్యాపార విషయాలు నాతో చర్చించారు. భోజనం అయ్యాక నా గదిలోకి వెళ్లాను. గోడమీద అమ్మ పటం వేళ్లాడుతోంది. ఆమె గనుక బ్రతికిఉంటే నాకు ఎంత సహాయం చేసునో.... నిజంగా తల్లి లేని లోటు తీర్చలేనిది. ఆ బాధ మరొక "తల్లి లేనివాడే'' అర్థం చేసుకోగలడు.

రాత్రంతా పక్కమీద యమయాతన పడ్డాను. ప్రేమ కల్లోకి వచ్చి "మీ నాన్న గారితో చెప్పి నన్ను వివాహం చేసుకోరా'' అని జాలిగా అడిగినట్టయ్యింది.

భళ్లున తెల్లారింది.

నా అసమర్థతకు సూర్యుడు ఫక్కుమని నవ్వాడు. బయల్దేరేముందు నాన్నగారు నాకో వంద రూపాయలు యిచ్చి "డబ్బు విచ్చలవిడిగా దగ్గర ఉంటే మనస్సు పట్టు తప్పుతుందంటారు. జాగ్రత్త! ఎట్టి పరిస్థితిలో కూడా అప్పు చేయకుండా ఉండటానికే ప్రయత్నిస్తూ ఉండు'' అన్నారు నేను తలవూపి వూర్కున్నాను.

చిరునామాదారుని కనుక్కోలేని ఉత్తరంలాగ వెనక్కు తిరిగి, గోపాలపూర్ చేరాను. పచ్చడిబండ పెట్టి బుర్ర పగులకొట్టుకుందా మనిపించింది. అంత మంచి తండ్రి కూడా ఉండి నా కోర్కె బయటపెట్టలేక పోయాను. నే నెందుకు పనికివస్తాను? నిజంగా ధైర్యం ఉండి నాన్నగారి నడిగితే ఆయన వద్దనరు. కాని అడిగేదే ఎలా ? నేను అడగలేను. చెప్పలేను. ఇలాంటివి రాయబారాలవల్ల జరుగుతాయంటారు. కానీ నాన్నగారితో బాగా చనువున్నవాళ్ళు ఎవరు ? వాళ్లతో నాకూ చనువుండాలి.

అలాంటివాళ్లెవరూ నాకూ లేరు.

ప్రేమని తలుచుకుంటూ వో వారం గడిపాను.

వారం తిరిగిన కాలం వోరోజు పొద్దున్న దగ్గర మేలేసుకుపోయింది. ఆరోజు పనిమనిషి రాలేదు. నాకు చిరాకెత్తింది. ఛీ. వెధవ జీవితం. — అసలే వంటొండుకుని చావాలి. పైగా యీ ఇంట్లో గొడవ !! నన్ను, నా జీవితాన్ని దుమ్మెత్తి పోసుకుంటూ చేసేదిలేదు గనుక గిన్నెలు ముందేసుకుని, వో గిన్నెకు వోపిక కొద్దీ చింతపండు పట్టించాను. ఇంతలో నా వెనుక గాజులు శబ్దం అయ్యింది. వెనక్కి తిరిగి చూశాను.

"మీరేసేస్కుంటున్నారేటి ? లెగండి'' అందో పిల్లని, చక్కని చుక్క. వో క్షణం అలానే ఉండి, అనక లేచి నిలబడి, చింతపండు పారేస్తూ "ఎవరు నువ్వు'' అన్నాను. ఆమె కిలకిల నవ్వింది. కారణం తెలియలేదు.

"వరాలమ్మ మా పిన్నమ్మ'' అంది.

ఆమె అంట్లముందు కూర్చుంది. నేను చేతులు కడుక్కొని గడప నానుకుని నిలబడ్డాను. ఆమె అంట్లు తోముతూనే ఉంది. పల్లగా మిలమిలా మెరుస్తొందామె. చకచకా తోముతున్నందువల్ల ఆమె శరీరం లయబద్ధంగా కదులుతోంది. తలలో హో మందారపువ్వు పెట్టుకుంది. తాళయుక్తంగా కదులుతున్న ఆమె నడుము చూసేసరికి నాలో వింత కోర్కెలు పుట్టాయి. చక్కని అందం

అవయవ సౌష్ఠవం అన్నిటినీ మించిన యవ్వనం—ఏమిటి? ఇదేం తెగులునాకు? అనుకున్నాను. 'వయస్సు' అంది నా మనస్సు.

ఆమె అంట్లన్నీ తోమి, వంటింట్లో వోర్లించి, ఇల్లు చకచక తుడిచింది. నేను కూర్చుండలేను. మంత్రముగ్ధుడిలా ఆమె వెనువెంట తిరిగాను. చీపురు యథాస్థానంలో పెట్టి, ముఖంమీద పడిన ముంగురుల్ని వెనక్కు తోసుకుంటూ, "మా చిన్నమ్మకి వంట్లో ఇహనుంచి నేనే వొస్తా" అంది. నేను కదలబారేను.

"మళ్లీ ఎప్పుడొస్తావ్" అన్నాను.

"సందేళ" అందామె. చకచకా పనంతా చేయడంవల్ల కాబోలు ఆయాస పడుతోంది. నేను నా దృష్టిని ఆమె వక్షంమీద

---



---




ఎక్కడ
# లైఫ్‌బాయ్ వున్నదో
# అక్కడ ఆరోగ్యము వున్నది

లైఫ్‌బాయ్ సబ్బుతో ఆనందంగా స్నానం చేయండి! మీరు ఉల్లాసంగాను పరిశుభ్రంగాను మరియు ఆరోగ్యంగాను హాయిగాను వుంటారు. మీకు కలిగే అత్యంత ఉత్సాహంవల్ల లైఫ్‌బాయ్‌లో ఉత్తమమైన సబ్బులో వుండవలసిన అన్ని సుగుణములే గాక ఇంకా ఎన్నియో వున్నవని మీరు తెలిసికొందురు......

## లైఫ్‌బాయ్ మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

మరల్చుకున్నాను. ఆమె పైట చెంగు సరి చేసుకుని, కొంగు బొడ్లో దోపుకుంటూ, "నే వెల్లొత్తా" అంది.

"మాట" అన్నాను.

వెనక్కొచ్చి, "ఏటి" అంది. "మీ పిన్నమ్మకి వంట్లో బాగులేదా" అన్నాను. తీరా పిలిచాక ఏమని మాట్లాడాలో బోధ పడక.

"అవును బాబూ" అంది.

"ఆహా. నీపేరేమిటి" అన్నాను.

"సివాసెలం" అంది తల్లోంచి కింద పడ మందారపువ్వు తీసి, తిరిగి తలలో పెటుకుంటూ. నే నామెకేసి మరోసారి చూసి, "సరేలే వెళ్ళు. సాయంత్రం ఆరు దాటాక రా" అన్నాను. సింహాచలం వెళ్ళి పోంగానే పెట్టె తీసి, ప్రేమకు తీసిన ఫోటో చేతో పటుకుని కుర్చీలో కూర్చున్నాను. ఫోటోలో ప్రేమ—నన్ను మరిచిపోయావా అని దీనంగా నా వంక చూసినటు అనిపించింది. పనిమనిషిని చూసి అంత చలించిపోతే ఎలా ? అని ప్రశ్నించినట నిపించింది. నాకు సిగ్గేసింది. ఏవిటో వెధవ వయస్సు—మనం వెనక్కు లాగుదా మనుకుంటే అది రెటింపు శక్తితో ముందుకు లాగుతుంది. ప్రేమను ప్రేమించినటు నాన్నగారికి ఉత్తరం రాసేనో—అవును. అది మంచి వూహ. అనుకున్నాను. వెంటనే రాయడం ప్రారంభించాను. కాని ఎలా రాయాలో కుదర లేదు. చాలా కాగితాలు పాడయ్యాయి. చాలా రోజులు ఆలోచించినా రాసే విధానం కుదరలేదు.

నేనో పనికిమాలిన వెధవను అని తిటుకున్నాను. మరో వారం తిరిగేసరికి పోనాడు రామనాథంగారు వచ్చి, "మా మేనగోడలు పెళి. నీ విష్యురాలేనయ్యా. వైజాగులో యీ నెలాఖర్నే... తప్పక రావాలిస్మి" అని, "నసా ! చాలామందిని కల్చుకోవాలి" అనేసి వెళ్ళిపోయారు. భూమి బొంగరంలా తిరిగినట్లయ్యింది. కుర్చీలో కూరోబోయి క్రింద పడ్డాను. లేచి మంచంమీద కూర్చున్నాను. శుభలేఖ తీసి చూశాను. వరుడు మోహన్—మోహన్—నా స్నేహితుడు—చదువుకునే రోజులో పైకి

# ముద్దమందార

పెళ్ళొద్దు బాబోయ్ అని గోల పెటేవాడు.

ప్రేమలాంటి అందమైన పిల్ల కనుపిసే వదనేవా డెవడు ? మోహన్ చాలా అదృష వంతుడు.

ఆరాత్రి నేను భోజనమే చెయ్యలేదు. తెలారుతూనే పనికివచ్చిన సింహాచలం తోమాల్సిన గిన్నెలు లేకపోడంవల్ల ఆశ్చర్య పోయి, "రేత్రి వంటొండుకోలే దేటి" అంది.

"లేదు" అన్నాను.

"ఏం ! వొంట్లో బాగుండ్లేదేటి" అంది.

"అవును—కాదు—ఆకలిగా లేదు."

సింహాచలం ఫక్కుమంది. "పరాగ్గా ఉన్నారు. డాక్టరు దగ్గర కెల్లండి" అంది మరోసారి నవ్వుతూ. నా చూపులు సింహాచలం మీదికి వెళ్ళాయి. నా కంటికి సింహాచలం వనలక్ష్మిలా కనుపించింది. ఎర్ర పరికిణీ, నల్లవోణి, తెల్లటి రవిక—తలలో గన్నేరు పువ్వులు, చేతులకు నీలం గాజులు....

"సింహాచలం మాట" అన్నాను.

"ఏటి బాబూ" అంది.

"ఏటి బాబూ అనకు. ఏటీ లేదు వూటీ లేదు. ఏమిటీ అనలేవూ .... కాస కాఫీ కాచి ఇవ్వగలవా—తల నొప్పిగా ఉంది కానీ" అన్నాను.

"హో యిస్సుగా" అంది. చీపురు గోడ కానించి, వంటింట్లోకి వెళ్ళిపోయింది. నే నుస్సురుమన్నాను. టేబులుమీది శుభ లేఖ మళ్లీ చూశాను.

సింహాచలం చక్కని కాఫీ తెచ్చిచ్చింది. నాకో గ్లాసుడు యిచ్చి తనో గ్లాసున్నర తాగి "కాఫీ శానా బాగు ....

"శానా అనకూడదు చాలా అను" అన్నాను.

"నాకు తెల్దు బా ......

"తెల్దు కాదు. తెలీదు అనాలి."

సింహాచలం విరగబడి నవ్వుతూ, "నాకు సదువు సెపా రేటి" అంది. అని మళ్ళీ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. నేను ఉస్సురుమంటూ కుర్చీలో కూలబడ్డాను.

(సశేషం)

# స్నేహానుబంధము

## గ్లాసెడు **కిసాన్** స్క్వాష్



*మొనాకో బిస్కట్లతో కిసాన్ స్క్వాష్... ఎంతో రుచి, మీరెల్లా తీసుకుంటారు.*

విలాసవంతమైన యువక ప్రపంచంలో అనుకోకుండా ఆవిర్భవించింది ఇది. కిసాన్ స్క్వాష్! – ఆహా! ఎంతరుచి! – ఉల్లాసవంతమైన విచ్చెలులకు. దీని ప్రత్యేకమైన రుచి ఉత్తేజాన్ని కల్గిస్తుంది. ఇంతకంటే కూడా సహజమైన విటమినులతో ఆరోగ్యదాయకంగా ఉంటుంది – (సీసాలో అసలుపండు కన్పిస్తుంది).

ఆధునాతన జీవిత నిర్మాతలతో సరిసమంగా చేరండి. ఒక గ్లాసెడు కిసాన్ స్క్వాష్ చెలిమితో.

నారింజ, నిమ్మ, మామిడి ఇంకా ఇతర రకాలనుండి మీకు ఇష్టమైనదానిని వాడండి.

కిసాన్ స్క్వాష్‌తో అసలు పళ్లరుచిని అనుభవిస్తారు

భారతదేశంలో విస్తారంగా అమ్ముడుపోయే స్క్వాష్
కిసాన్ ప్రొడక్ట్స్ లిమిటెడ్, బెంగళూరు.

EWT KP-2479

# చెల్లాయికి ప్రేమతో... 9

'పి. ఎస్'

చెల్లీ,

జీవితం "మొనాటనస్‌గా" తయారైందనీ, తానొక యంత్రంలా బ్రతుకుతున్నాననీ అంటూ ఈమధ్యన వసుంధర నాకొక ఉత్తరం వ్రాసింది. వసుంధర నీకు తెలుసుగా. ఈ వసుంధర భర్తకి మంచిఉద్యోగమే. నెలకి రెండుమూడు వందలు మిగుల్చుకోగల ఆదాయం ఆయనకి. నలుగురు పిల్లలు. ఇంట్లో వంట మనిషి. ఒకపనిపిల్ల. మధ్య మధ్యలో ఆఫీసుజవాను బజారుపనులు చేస్తూ వుంటాడు. కావలసినంత తీరిక. అలసిపోవలసిన పనులేం లేవు. అయినా, వసుంధర కిదో అసంతృప్తి. సహజంగా అందరు స్త్రీలలాగే తనకీ నగలన్నా, చీరెలన్నా మోజుఎక్కువ. ఆయనకి ఇంట్లో గడపడానికి గంట తీరిక కూడా దొరకదు. ఎప్పుడూ తనూ, పిల్లలూ! స్నేహితులు లేరు. ఆయనకీ లేరు. తనకీ లేరు. పిల్లలు బడికిపోయాక వుండీవుండీ వంట మనిషినీ, నౌకరునీ గదమాయిస్తూ వుండడం వసుంధర పని. నేను వాళ్లయింట్లో నాలుగురోజులుంటే నాకే పిచ్చి ఎక్కినంత పనైంది. పిలలు బడికి వెళ్లిన దగ్గర నుంచీ వసుంధరకి తీరిక. అవసరానికి మించిన తీరిక.

అంత తీరిక గల వసుంధరను చూసి నేను అసూయపడ్డానుకూడా... రెండు గంటలసేపు నిద్రపోవడంతప్ప తక్కిన సమయమంతా అలా గోళ్లు గిల్లుకోడమే. ప్రక్కయింట్లో వాళ్లని పరిచయం చేసుకోక పోయావా! అని అడిగాను. వాళ్లు తన అంతస్తుకి తగరన్నట్లు, వాళ పిల్లలు తమ యింటికివస్తే ఫర్నిచర్ తొక్కి పాడు చేస్తారన్నట్లు మాటాడింది. భర్త ఎవరినీ పరిచయం చేయలేదు. తనకి చేసుకోడం చేతకాదు.భయం. ఇకస్నేహితులెలా వుంటారు! అందుకే ఒంటరి తనం, మొనాటనీ.....

కాలాన్ని సద్వినియోగం చేసుకోడం, కాలంలోనుంచీ సంతోషాన్ని పిండుకోడం నేర్చాలి గానీ, వృధాగా కాలయాపన చేయడం అనారోగ్య కరం అని వసుంధరతో అన్నాను. "ఎలా?" అంది ఆశ్చర్యంగా.

"పుస్తకాలేవైనా చదువుకోకూడదూ?' అన్నాను.

"ఏం చదవనూ? వారపత్రికలు ఒక రోజులో అయిపోతాయి. పేపరు చదవాలని పించదు. ఏమిటో సౌత్ వియత్నాం నార్త్ వియత్నాం అంటారు. నాకదేం అర్థం కాదు." అంది వసుంధర.

"వార పత్రికలమాటకాదు. మంచి పుస్తకాలు. అంటే నవలలు అలాంటివి"

"ఏమోబాబు నాకు విసుగు. నేను చదవను"

"పోనీ ఎంబ్రాయిడరీ చేయకూడదూ?"

"మాఇంట్లో కావలసినన్ని టేబిల్‌క్లాత్‌లున్నాయి..... ఎంబ్రాయిడరీ చేసినవి కొంచెం ఖరీదు ఎక్కువ పెడితే షాపులో దొరుకుతాయి—మనకెందుకీ అవసరం, కొనలేని వాళకిగానీ—" అంది.

నాకొక చెంపనుంచి కోపంవస్తున్నా నిగ్రహించుకుని, "వంటమనిషిని మాన్పించి చూడకూడదూ?" అన్నాను కొంటెగా.

"వంట అలవాటు తప్పిపోయి కొన్ని సంవత్సరాలయింది. నేను చేస్తే ఇకనోట పెట్టుకునేటట్లే వుండదు. అయినా వంటమనిషిని తీసేస్తే పీనాసితనం అనుకుంటారందరూ—" అంది వసుంధర....

ఈతరహామనుష్యులంటే నాకు మొదటి నుంచీ విసుగే. మన సలహా పాటించే వాళ్లలాగా అడుగుతారు. చొరవ తీసుకుని ఏదైనా చెబితే ఏవో కుంటిసాకులు అప్పు చెప్పి ఏవో తప్పుకో జూస్తారు.

"సరే నీ యిష్టం వచ్చినట్లు అఘోరించు" అని లేచాను.

"అదికాదు—"అంటూమొదలుపెట్టింది.

"ఏదికాదు? నీకు చెప్పడం నావల్ల కాదు." అని విసుక్కుని ఆఖరి సలహాగా తోటమాలిని తీసివేయమని చెప్పాను. "అమ్మో—అలా వీల్లేదు" అంది. అంత స్తులతో గిరులు గీసుకుని వాటిమధ్య యిరుక్కుపోయిన వసుంధరని మార్చడం నా తరం కాలేదు. తను నామాట అసలు వినదు. మనసుకి, శరీరానికీ పరిశ్రమ లేకపోవడం అన్ని విధాలా అనర్థదాయకమే అనుకుంటాను. ప్రపంచం ఎంత విశాలమైనది? మనకి తెలియని విషయాలు ఎన్ని ఉన్నాయి?



# వనితాలోకం

ఏదో తెలుసుకోవాలని, ఏదో చెయ్యాలని ఏదో చెప్పాలనే తపన, తృష్ణ ఉన్నవాళ్లకి జీవితం నిస్సారంగా మోనాటనస్‌గా అనిపించవే అనిపించదు. ఏమీ చెయ్యలేని వాళ్ళకి, ఏమీ తెలుసుకోలేని వాళ్లకి, ఏమీ చెప్పలేనివాళ్లకి, ఏమీ సుఖం ఉండదు. ఎన్నివున్నా సంతోషం ఉండదు. ఒక ధ్యేయంలేని బ్రతుకు వాసనలేని కాగితం పువ్వులాంటిది. అవకాశాలన్నీ అందుబాటులో వుండీ, వాటిని సద్వినియోగం చేసుకోలేని వాళ్ళని చూసి జాలి పడడంకన్న ఏమీ చెయ్యలేము. ప్రపంచంలో ఏం జరుగుతోందో తెలుసుకోవాలనిలేదు. మనచేతులతో అందమైన వస్తువుని తయారుచేసి సంతోషిద్దామనిలేదు. వంట కూడా కళే కనుక మన చేతులతో వండి పెడదామని అంతకన్న లేదు. కొత్త రుచులు కనిపెట్టాలనీ లేదు. అన్నిటికీ "లేదు" "లేదు". అందుకే ఉత్సాహంలేదు. శారీరకంగానో, మానసికంగానో నిత్యం పరిశ్రమించేవారికి నిరుత్సాహం చెందే "టైం" ఉండదు. వాళ్ళ జీవితం అతి వేగంగా పరిగెడుతుంది. రోజుకు 25 గంటలుంటే బావుండును, వారానికి రెండు ఆదివారాలొస్తే బావుండును అనుకుంటారు. కానీ వసుంధర కలా కాదు రోజుకి 20 గంటలు చాలవా? అనిపిస్తుంది. అందుకే ఒక ధ్యేయం ఉండాలి ప్రతిమనిషికీ. కనీసం ఒక హాబీ అయినా ఉండాలి. సంగీతం మీదనో, సాహిత్యం మీదనో మనస్సు లగ్నం చేస్తే కాలం విమానంకన్నా వేగంగా, మనస్సుంతవేగంగా పరిగెత్తుతుంది. కాలం గడపడం ప్రధానం కాదు. కాలాన్ని సద్వినియోగం చేసుకోడం ప్రధానం కాని, అందుకే సత్కాలక్షేపం, విజ్ఞానాన్ని, వినోదాన్ని ప్రసారించి కాలాన్ని జరుపుకుంటూ పోయే సత్కాలక్షేపాన్ని, ఆశ్రయించడం అవసరం, మనో వికాసానికీ విజ్ఞాన సముపార్జనకీ కృషిచేయడం మన విధికదా? ఏమంటావ్?

వి
అక్క.

## న్యూఢిల్లీ లేఖ

(8 వ పేజీ తరువాయి)

దానిపై చర్చ భారతదేశంలో బ్రిటీష్ వలన విధానం వదలిపెట్టి వెళ్లిందే, అంయినప్పటికీ ప్రతిపక్షం దాని విధానం, సంఖ్యాబలాలను దృష్టిలో ఉంచుకుని బడ్జెట్ కేటాయింపును సరి చేయుటంగానీ, మార్పడంగానీ చేయలేని పరిస్థితిలో ఉంది. కాని అది అనవసరమైన, లాభదాయకంకాని, దుబారా ఖర్చుల విషయంలో విమర్శించగలదు, విమర్శిస్తుంది కూడా. నియమబద్ధమైన ఖర్చుపై ఈ ప్రాథమికమైన పరిశీలనకు ఇంతవరకూ పార్లమెంటు, ముఖ్యంగా ప్రతిపక్షం కూడా అసలు జరపలేదు. ప్రస్తుతవిధానంలో ఒక మంత్రి నో విషయాన్ని ప్రతిపాదిస్తారు, అందుకు కావలసిన ఖర్చుకొరకు లోక్‌సభ అంగీకారం అడుగుతారాయన.ఆయన దాన్ని వివరిస్తూ ఉపన్యాసాన్నియిస్తేయిస్తారు. లేకుంటేలేదు. అప్పుడు కొన్ని సవరణలు సూచింపబడతాయి. విధానాల విషయం చర్చించడానికి. ఆయన ఒకే ఒక సమాధానంతో చర్చని ముగిస్తాడు. ఆయన కోరిక నిరభ్యంతరంగా అంగీకరింపబడుతుంది. ఇంతకుముందు చెప్పినట్లు చాలా మంది మంత్రులు విధానానికి సంబంధించిన చర్చను కూడా తప్పించుకున్నారు.

పార్లమెంటు యింకొక ముఖ్యమైన సమావేశాన్ని జరుపుతుంది. డిశంబర్‌లో జరిగే సమావేశం ఎన్నికలముందు జరిగే సమావేశం. అందులో ప్రభుత్వం ముఖ్యమైన బిల్లుల ప్రస్తావనే తీసుకురాకూడదు, తీసుకురాదు. ఇప్పుడు ఆమోదింపబడకుండా అలాగే ఉన్నబిల్లులన్నీ లోక్‌సభ మూసివేయబడగానే పనికి రాకుండాపోతాయి. అత్యవసరమైన బిల్లుల ఆమోదానికి ప్రభుత్వం త్వరపడటం, ప్రతిపక్షంతోముఖ్యంగా డాక్టర్‌రాంమనోహర్ లోహియా వర్గంతో ఒక సమాధానానికి రావటం అవసరం. రెండవది మంచి ఆలోచనా శక్తి అవసరం. ఇక మూడోది క్రమశిక్షణను కాంగ్రెస్‌పార్టీ సభ్యులకు మారిపోయాలి.

ఈనాడున్న పరిస్థితి దృష్ట్యా చూస్తే పార్లమెంటరీ యంత్రాంగం పూర్తిగా విచ్ఛిన్నం అయ్యే అవకాశం ఉంది.●

# నగరంలో సోవియట్, హంగరీ చిత్రోత్సవాలు

## సోవియట్ ఫిలిం ప్రతినిధులకు ఫిలిం ఛేంబర్ ఆహ్వానం

సోవియట్ చలన చిత్రోత్సవ సందర్భంలో భారతదేశానికి వచ్చిన ప్రతినిధులను ఆహ్వానించి సౌత్ ఇండియన్ ఫిలిం చేంబర్ ఆఫ్ కామర్స్ సన్మానించింది

ఏప్రిల్ 16 వ జరిగిన ఈ సమావేశానికి సినీ పరిశ్రమలోని ప్రముఖులు, పత్రికా విలేఖరులు ఇతర పెద్దలు విచ్చేశారు ప్రారంభంలో అఖిల భారత ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ ఎ ఎల్ శ్రీనివాసన్ను దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలి అధ్యక్షుడు శ్రీ వాగిరెడ్డి వేదికమీదకి ఆహ్వానించారు

శ్రీ ఎ ఎల్ శ్రీనివాసన్ తన ఉపన్యాసంలో సోవియట్ చలన చిత్రోత్సవం భారతదేశంలో జరగటం ఉభయ దేశాలమధ్య నెలకొనిఉన్న స్నేహ సంబంధాలను వృద్ధి చేస్తుందని, ఎన్నో ముఖ్యమైన భారతదేశం సమస్యలకు సోవియట్ యూనియన్ తన సహకారాన్నందించి పరిష్కరించడానికి ప్రయత్నిస్తున్నదని, ఇటీవలి పాక్ సంఘర్షణ విషయంలో కూడా తాష్కెంట్ సమావేశం ద్వారా శాంతి స్థాపనకు ఎంతో కృషి చేసిందని అలాంటి మిత్ర దేశంనుంచి వచ్చిన ప్రతినిధివర్గాన్ని ఆహ్వానించగల అవకాశం కలిగినందుకు ఎంతో సంతోషంగా ఉందని, వివిధ రకాలుగా, భారతదేశ శ్రేయోభివృద్ధికి ఎంతో సహాయ సహకారాలను అందిస్తున్న సోవియట్ యూనియన్, ఫిలిం పరిశ్రమ విషయంలో కూడా సహాయ సహకారాలను అందించి ప్రోత్సహిస్తే ఎంతో బాగుంటుందని అన్నారు

అనంతరం ప్రతినిధివర్గంలోని అల్టీకార్లిన్ తనతోటి ప్రతినిధులను సభికులకు పరిచయం చేశారు

టర్క్మేనియా సినిమాటోగ్రాఫర్ల సంఘం చైర్మన్, 'ది జిప్సెస్ స్టెప్' చిత్రానికి దర్శకుడు శ్రీ అల్టీ కార్లిఫ్, దర్శక నిర్మాత శ్రీ అలెగ్జాండర్ రోవ్, ప్రఖ్యాత సోవియట్ నటి కుమారి స్వెట్లానాస్వెట్లిచ్నాయా తమ ఉపన్యాసాలలో భారతదేశానికివచ్చి మిత్రులను కల్సుకున్నందుకు తమ కెంతో ఆనందదాయకంగా ఉందని, తాము భారతీయ చిత్రాలను కొన్నింటిని చూశామని, అవి చాలా బాగున్నాయని, మాస్కోలో ఫిలిం ఫెస్టివలోకి భారతీయ చిత్రాలను కూడా ప్రదర్శించాలని చెప్పి భారతీయులు చూపిన ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు తెలిపారు అనంతరం సోవియట్ ప్రతినిధులకు చేంబర్‌వారు మధుర దేవాలయం చెక్కబడిన ఒక షీల్డ్‌ను బహూకరించారు అనంతరం శ్రీ వాగిరెడ్డి వందన సమర్పణ చేశారు

## హంగేరియన్ ఫిలిం ఫెస్టివల్

మద్రాస్ ఫిలిం ఫాన్స్ అసోసియేషన్ వారు ఏర్పాటు చేసిన హంగేరియన్ చలన చిత్రోత్సవానికి ఏప్రిల్ 28వ తేదీ సాయంత్రం శ్రీ ఎం కె దీనదయాళన్, డైరెక్టర్ ఆఫ్ పోస్టల్ సర్వీసెస్, ప్రారంభోత్సవం చేశారు ఈ సమావేశానికి శ్రీ కె కాశీపతి (రీజియనల్ ఆఫీసర్, సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిలిం సెన్సార్స్, మద్రాసు) అధ్యక్షత వహించారు

మూడు రోజులపాటు జరిగిన ఈ చలన చిత్రోత్సవంలో 'ది లాండ్ ఆఫ్ ఏంజిల్స్', 'కరెంట్', 'ఎ గ్లాస్ ఆఫ్ బీర్', 'స్కైలార్క్' చిత్రాలతోబాటు హంగేరియన్ల నాగరికత, అలవాట్లు, ఆచారాలను ప్రతిబింబింపజేసే విడివి తక్కువ చిత్రాలు కూడా ప్రదర్శింపబడినాయి.

మొదటిరోజున ప్రదర్శింపబడిన 'ది లాండ్ ఆఫ్ ఏంజిల్స్' రెండుచోట్ల 'గ్రాండ్ ప్రిక్స్' ని అందుకోడమే కాకుండా 'ఎక్సలెన్స్' అని కూడా పేర్కొనబడింది

'ఆనందాన్ని వెతుక్కుంటూ వెళ్లటం మానవ నైజం' అన్న విషయంపై రూపొందింపబడినది ఈ చిత్రం సహజంగా ఉన్న దృశ్యాలు, చక్కటి నటన ఈ చిత్రంలో కన్పించినా ప్రేక్షకునికి విసుగనిపిస్తుంది చిత్రం చూస్తుంటే

రెండవరోజు 'కరెంట్', 'ఎ గ్లాస్ ఆఫ్ బీర్' చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి.

'కరెంట్'లో విద్యార్థులు కొంతమంది ఏటి ఒడ్డుకు పిక్నిక్‌గా వెళ్లటం, కొంతసేపు నదిలో ఈది బయటికి వచ్చిన తర్వాత తమలో ఒకరు తప్పిపోయారని తెల్సుకుని వెతికి ఫలితంలేక' పోలీసులకు తెలియపరచినా ప్రయోజనం ఉండదు చివరికి అతను చనిపోయాడని నిర్ణయించుకుని మిగిలినవారందరూ ఎంతో బాధపడ్తారు. జీవితంలో మిగిలిన ఆ ఒక్క ఆశాకిరణం కూడా అంతరించిపోయిందనే వ్యథతో చనిపోయిన విద్యార్థి నాయనమ్మ విలపించి అతను



'శ్రీ కాకుళ ఆంధ్ర మహావిష్ణుకథ'లో బాలయ్య, ఎల్. విజయలక్ష్మి.

'భక పోతన'లో జయశ్రీ

మునిగిపోయిన చోట ఏటిలో దీపం వెలిగించి వదిలిపెట్టేరావటం ప్రేక్షకుని హృదయాన్ని కదిలిస్తుంది నటీ నటులందరూ చక్కని నటనను ప్రదర్శించారు ఛాయాగ్రహణం దర్శకత్వం ప్రతిభావంతంగా ఉన్నాయి

'ఏ గ్లాస్ ఆఫ్ బీర్' చిత్రంలో ఒక సైనికుడు ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు. అమ్మాయి కూడా ఆ సైనికుని తన్ను యితరుల నెవ్వర్ని ప్రేమించకపోయినా అనుమానంతో ఆమ్మాయిని ఉపేక్షించ చేసుకుంటాడు సైనికుడు ఆకస్మికంగా అపార్థాలు తొలగిపోయి యిద్దరూ తృప్తిగా శ్వాస పీలుస్తారు చిత్రం హాస్యస్ఫోరకంగా ఉంది

చివరిరోజున 'స్కౌలార్స్' చిత్రం ప్రదర్శింపబడింది ఈ చిత్రంలో నటించిన ఎ. పోగర్ 1965లో ఉత్తమ నటునిగా ఎన్నికయ్యాడు

మొత్తంమీద చిత్రాల కథలు కొన్ని కొంతమందికి నచ్చకపోయినా చిత్రీకరణ, నటన, సాంకేతిక విలువలు మెచ్చుకోదగిన రీతిలోనే ఉన్నాయి హంగేరియన్ల నాగరికత, అలవాట్లు, ఆచార, వ్యవహారాలు ఈ చిత్రాలలో ప్రదర్శితమవుతాయి.

## సోవియట్ ప్రతినిధులకు ఎం. జి. రామచంద్రన్ ఆహ్వానం

సోవియట్ చలనచిత్రోత్సవ సందర్భంగా భారతదేశానికి వచ్చిన ప్రతినిధులకు ప్రఖ్యాత తమిళ నటుడు, నిర్మాత, స్టుడియో అధిపతి అయిన శ్రీ ఎం జి రామచంద్రన్ ఏప్రిల్ 20 వ తారీఖున తన స్వంత స్టుడియోఅయిన సత్యా స్టుడియోస్‌లో సన్మానం చేశారు ఈ సభకు డాక్టర్ పి వి రాజమన్నార్ అధ్యక్షత వహించారు వచ్చిన ముఖ్య అతిథులకు, ఆహూతులకు శ్రీ ఎం జి రామచంద్రన్ స్వాగతం చెప్పారు శ్రీ రామచంద్రన్ తమ ఉపన్యాసంలో తోటి కళాకారులైన సోవియట్ ప్రతినిధులు తన ఆహ్వానాన్నందుకుని రావటం చాలా సంతోషాన్ని కలిగించిందని, దక్షిణ భారత నటీ నటుల తరఫున తాను వారిని సత్కరిస్తున్నానని, ఎం జి ఆర్ ఎంటర్ ప్రైసెస్ తరఫున మరొకసారి పూలమాలలను వేశారు

అధ్యక్షులు శ్రీ పి వి రాజమన్నార్ తమ ఉపన్యాసంలో ఇది ఇక్కడి కళాకారులు మరొక దేశం కళాకారులకు యిస్తున్న ఈ ఆహ్వానం, ఉభయ దేశాల సౌహార్ద్రవ సమావేశంఅన్నారు ఎన్నో విధాలుగా వివిధ రంగాలలో భారతదేశానికి సహకారాన్ని అందిస్తున్న సోవియట్ యూనియన్ ఫిలిం పరిశ్రమకు కూడా సహాయాన్ని అందిస్తే బాగుంటుందని, సోవియట్ యూనియన్ సహకారంతో చిత్ర నిర్మాణం జరగటంవల్ల ఎంతో పురోభివృద్ధికి అవకాశం ఉందని అన్నారు ప్రతినిధులకు తమ శుభాకాంక్షలను తెలియచేశారు

అనంతరం ప్రతినిధివర్గంలోని అర్బీకార్లినోవ్, అలెగ్జాండర్ రోవ్, స్వెట్లానా స్వెట్లిచ్‌నాయా ప్రభృతులు, భారతదేశంవచ్చి తోటి కళాకారులకు కలుసుకున్నందుకు తమ కెంతో ఆనందదాయకంగాఉందని, మద్రాసులో తాము హాజరవుతున్న చివరి సమావేశం యిదేనని, 21 వ తారీకున తాము బొంబాయి వెళ్లిపోతున్నామని అక్కడి భారతీయ స్నేహితులను కల్సుకోవటం సంతోషకరమైన విషయమే అని అన్నారు మద్రాసులోని అనుభవాలు తమకు తమను మరువురానివి, సోవియట్ యూనియన్‌కు భారతీయ కళాకారులుకూడా రావాలని, తాము వారిని ఆహ్వానించి, సత్కరించే సందర్భంకోసం ఎదురు చూస్తుంటామని అన్నారు అనంతరం శ్రీ ఎం జి రామచంద్రన్ ఎం జి ఆర్ ఎంటర్ ప్రైసెస్ తరఫున జ్ఞాపికలను ప్రతినిధులకు బహూకరించారు —మాధవ్



పాతస్నేహితులకు కబురు ! (ఫోటోలు: ప్రభాకర్)

# ఎన్నెన్ని వీధుల్లో ఎన్నెన్ని జల్లులు 3

వాశిరాజు ప్రకాశం

(గత సంచిక తరువాయి)

సమస్యలు సహజంగా సమస్యలే.

వీటిల్లో కొన్నింటికి పరిష్కారాలుంటాయి; కొన్నింటికి అవి ఉండవు. పరిష్కారాల్లేని సమస్యల నడుమ—సాలెగూటిలో చిక్కుకొన్నట్లు చిక్కుకునిపోవటం. మరీ విషాదకరం.

యమున పరిస్థితి సరిగ్గా అంతే అయింది. జీవితంతో పోరాడాలనీ, విజయం సాధించాలని, నటి కావాలని ఆ అమ్మాయి ఎంత ఉవ్విళ్లూరిందో, ఆ అమ్మాయికివచ్చే అవకాశాలు అంత దూరం దూరంగా జరిగి పోతున్నాయి. అవకాశాలు రాకపోగా, ప్రమాదాలు, అవాంతరాలు మిగులుతున్నాయి.

* * *

శ్రీ యమునకు నిజ జీవితంలోకూడా సమస్యలెక్కువ. ప్రొద్దున్నే నిదురలేచింది మొదలు రాత్రి తిరిగి నిద్రపోయేవరకు అన్నీ ఇబ్బందులే. కొత్తతారలకు యీ యిబ్బందులు సహజమేననిపిస్తున్నది, యమునను చూస్తుంటే.

వేషాలు రావాలి. ఈ వేషాలకోసం, ఇక్కడి సినిమారంగంలో చాలామంది వేషా లెన్నో వేయవలసివస్తున్నది. కనిపించిన ప్రతిఅయ్యను, ప్రతి అమ్మను నోరు తెరచి అడగాలి. వారికోమాట చెప్పండి, వీరికో మాట చెప్పండి అని అడిగాలి.

యమున చెపుతుంది "తను చెయ్యని ప్రయత్నంఅంటూ లేదని" వేషాలకోసం!

* * *

ఒక్క యమునేకాదు సినిమారంగం గురించి బంగారు కలలుకంటూ, ఆకాశ హర్మ్యాలను నిర్మించుకొన్న ప్రతిఒక్కరూ ఎన్నో బాధలు పడాలి ఎన్నో రకాల పరిస్థితులకు బానిసలు కావాలి ఇతర్రా దమ్మిడికీ చెల్లని కొందరు వ్యక్తులకు సలాములు చెయ్యాలి ఆడమంటే ఆడాలి పాడమంటే పాడాలి ఏం చెయ్యమంటే అది చెయ్యాలి ఇలా, చేయలేని కొత్తవారు యింతదూరం రావటం కూడా దండగే

* * *

మదరాసులో ప్రతిరోజూచూస్తుంటాం, కొత్తవారిని! ముఖ్యంగా సినిమావారుండే త్యాగరాయ్‌నగర్‌లో వీరెక్కువగా కనిపిస్తుంటారు. ముందే చెప్పినట్లు, వీరిలో చాలా

మంది ఒంటరిగా రారు వీరివెంట ఎవరో ఒకరుండాలి అసలు ఆ ధైర్యం ఏదీ లేనిదీ యింతదూరం రారు ఆ తీసికొచ్చే వ్యక్తి కూడా అంతకుక్రితం వాళ్ల వూళ్లో ఏవో చిన్న 'వేషాలు' వేసివుంటాడు ఆ సందర్భం లోనే యీ అమ్మాయికూడా తారసపడ ఉంటుంది ఆ పరిచయం క్రమేణా పెరిగి పోతుంది ఇక ఇద్దరూ కలలుకంటూ ఉంటారు ఒకరు నాగేశ్వరరావు కావాలని, మరొకరు సరోజాదేవికావాలని!

* * *

సరిగ్గా యిలాంటి జంట ఒకటి యీ విలేఖరికి ఎనిమిది మాసాలక్రితం తారస పడింది టి నగర్‌లోని ఒక హోటల్లో

ఈ తారసిల్లటంకూడా చాలాచిత్రంగా జరిగింది ఏమండీ, యిక్కడ 'ఫలానా' కంపెనీ ఆఫీసు ఎక్కడండీ?' అని అడిగారు వారికి ఏదో ఫిలిం కంపెనీఆఫీసు కావాల్సి వచ్చింది, అడిగారు

వీళ్ల ప్రశ్న వినగానే, వీరి వాలకం చూడ చూడగానే అనిపించింది వీరు 'ఫలానా' అని!

నిజంగా వీరడిగిన ఆఫీసు, వీరడిగే నాటికి మూలపడిపోయివుంది అంతకు క్రితం ఆరునెలలకు పూర్వమే ఆ కంపెనీ, మూసేశారు తీసిన ఒక్క పిక్చరూ 'ఫ్లాప్' అయేసరికి ప్రొడ్యూసర్ గారు యింటికెళ్లారు ఆ డైరెక్టరుకు మొన్నటివరకు మరో పిక్చర్ రాలేదు

అసలిక్కడి సినిమా కంపెనీలన్నీ అంతే! ఇక్కడ సినిమాలు తీద్దామని వచ్చే చాలా మంది ధనికులకు, సినిమా తీయటంకంటె ముఖ్యమైన వ్యాపకాలు చాలా ఉంటాయి వూళ్లో బాగా డబ్బుండి, వరిపంటలుబాగా పండి లేదా, పండిన పొగాకును మంచిధరకు అమ్మగా వచ్చిన డబ్బును ఖర్చు పెట్టటానికి మార్గం కావాలి ఈ మార్గాలు మద రాసులో అయితే రాజమార్గాలే! పైగా స్వగ్రామంలో యిలాంటి వెర్రి వేషాలువేస్తే రాను రాను మంచి నీళ్లు కూడా పుట్టవు అందువల్ల సులభమైన పరిష్కారమార్గం— సినిమా తీయటం!

సినిమాలు తీయటం కూడా కొందరి విషయంలో చాలా చిత్రంగా ఉంటుంది. కొందరు మొదట్లో ప్రకటనలిస్తారు. కొత్త వారు కావాలని! కొందరికి పాతవారేకావాలి.

సినిమా కంపెనీలు చాలావరకు "జవ రాండ్రఉత్తముల్''లాంటివి ఆడదానికి ఇవాళ వుండేవనను రేపుండదు! అలాగే యివాళుండే సినిమాకంపెనీ రేపటికి క్లోజ్! ఎవరన్నా అడిగితే వూరికెళ్లారనో, గుమాస్తాకు ఒళ్లు బాగాలేదనో చెప్పటం పరిపాటి తీసిన సిని మాకు నష్టంవస్తే, యీ విషయం అసలు చెప్పనక్కరలేదు మళ్లీ పొగాకు పండేవరకు దర్శనం యివ్వరు నిర్మాతలు (నిర్మాతలను గురించి యింత చెప్పినందుకు పాఠకులు మన్నించాలి!)

ఇలాంటి నిర్మాతల అధ్వర్యాన తయా రయే చిత్రాల్లో నటించటం మాటలా? నిర్మాతల అడుగులకు మడుగులొత్తకపోతే కొందరు పెద్ద తారలకే ముప్పు! కొందరు పెద్ద తారలకే పంకాలు విసురు తుంటారు కొందరు నిర్మాతలు ఇక చిన్న తారలు,కాబోయే తారల పరిస్థితి అడగాలా?

నిర్మాతలట తరచుగా కాబోయే తారల యిళ్లకు కార్లుపంపుతుంటారు (ఎందుకు అని అడగకండి!) ఇలాంటి సందర్భాలు నేనింతవరకు కనీసం ఒక డజను విన్నాను యమున కూడా యిలాంటి అవాంతరాలను ఎదుర్కోవలసి వచ్చిందట?

కాని; యమున లొంగిపోయిందా? లేక నిర్మాతలు వీగిపోయారా?

తనలొంగిపోయివుంటె తానీపాటికి పెద్ద తారను తప్పకుండా అయివుండేదాన్నని యమున ఎంతో విచారంగా చెప్పింది!

నటీనటులక్షేమము, శ్రేయస్సు ఆలో చించని నిర్మాతలు లేరని నా తాత్పర్యం కాదు ఎక్కడో ఒకరిద్దరు! సంస్కారం, మంచితనమూవున్నవారు చాలా తక్కువ. అవన్నీవుంటె, యింతదూరంవచ్చి యీ 'జూదం'లో దిగేవారేకాదు (దీన్ని జూదమే ననాలి వస్తే లక్షలొస్తాయి పోతే లక్షలుపోతాయి ఇక జూదంకక మరేం అవుతుంది)

* * *

1958లోఅనుకొంటా—ఒకసారిమదరాసు 'స్కూల్ అఫ్ పబ్లిక్ ఒపినియన్' వారు సర్వే నొకదానిని జరిపారు 18 సంవత్సరాల లోపుపిల్లలందరినీ—ఆడపిల్లలనీ మగపిల్లలనీ కలిపి—ఎన్నో ప్రశ్నలు వేశారు పెద్దవా రయాక ఏం చేదామనుకొంటున్నా రని అడిగారు, వీరిని వీరితో చాలామంది మొదట్లో చెప్పలేదు

"చెప్పు తల్లీ, ఫరవాలేదు మే మెవ్వరికీ చెప్పంగా" అనడిగారు పరిశోధకులు లాలిస్తూ!




బీచ్‌లో ఒకనాడు!

# పన్నీటి విధుల్లో...

సిగ్గుపడుతూ చెప్పారు చాలామంది, సినిమాస్టార్ కావాలనుకొంటున్నామని.

ఇలా చెప్పినవారు ప్రతి నూరులో 80 మందిదాకా ఉన్నట్లు అమధ్య మిత్రులొకరు చెప్పారు. ఇలా ఉంటాయ్. చిన్న తనమంటే వీరి అభిరుచులు!

ఈ అభిరుచుల ప్రమాణమూ, పరిమాణమూ యిలా పెరిగిపోతే, ముప్పు తప్పదు, సమాజానికి!



వంటపనిలో సాయం !

ప్రతి నూరుమందిలో 80 మంది, 90 మంది సినిమా స్టార్ కావాలనుకొంటుంటే, యిక సినిమా చేసేది మిగతా పదిమంది మాత్రమేనా?

సినిమాల్లో అవకాశాలా రావు పోయిన దారమే అనుకొన్నట్లు, ప్రతి నూరుమందిలో 73 మంది గడిపే జీవనం దుర్భాగ్యంగా ఉంటుంది 'విషవలయం' లో చిక్కుకొని పోయిన 73 మందినీ పరిస్థితులు ఆ వలయంలోనే కట్టివేస్తాయి. ఫలితంగా 'అవినీతి' పెరిగిపోతుంది. లేదా, కటిక దారిద్ర్యం అనుభవించి, మెతుకు తిండి లేకుండా అల్లాడిపోవాలి,

చాలామంది అమ్మాయిలు పోలీసులకు దొరికిపోతుంటారు. ఇలా దొరికేవారిలో తెలుగువారే ఎక్కువమంది అని ఒక అధికారి చెప్పటం, నిజంగా మా విలేఖరికి బాధ కలిగించింది. పోలీసుల చేతికి దొరికిన తరువాత అనుభవించినవలసిన జీవితం మరీ దుర్భరంగా ఉంటుంది. చేజిక్కించుకొన్న పోలీసులు వీరిని కొంతకాలం కటకటాల మధ్య ఉంచుతారు ఈలోగా 'చార్జిషీటు' తయారుచేసి కోర్టులో దాఖలు చేస్తారు ఈ అమ్మాయిలు కోర్టుల కెళ్ళాలి

మదరాసులో యిలాంటి కోర్టు సైదాపేటలోవుంది ఆ కోర్టు అవరణలో రెండు రోజులు నిలబడితే చాలు. పరిస్థితి తెలిసిపోతుంది. ముఖాలనిండా గుడ్డలు కప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ వస్తారు యీ అమ్మాయిలు. (ఇలాంటి ఫోటోలు తీయటానికి మా విలేఖరికి అనుమతి లభించలేదు.) అథవా యిలాంటివారెందరో కూడా వివరం తెలియలేదు!

కాని యీ సమస్యలకు పరిష్కార మార్గం కావాలి. అందరి హృదయాలలో చైతన్యం రావటం ఇందుకు ఒకే ఒక మార్గం! మరీ మొరటు దారిపోయిన వారిని తీర్చిదిద్దటమూ జరగాలి!

అయితే, దీనికి బాధ్యత ఎవరిది?

ఏ ఒక్కరిదీకాదు. అందరిదీ!

కళకోసం, కళపేరుతో అంటే కళామతల్లి చరణారవిందాలచెంత బ్రతుకుతున్నామని, చెప్పుకొంటున్న చాలామంది 'అవినీతి' అనే బ్రహ్మరాక్షసి కబంధ హస్తాల్లో నలిగిపోవటం ఎవరికీ శ్రేయస్కరంకాదు. చూచేవారికీ, వినేవారికీకూడా గౌరవప్రదం అంతకన్నాకాదు.

దీనికి ఒకటే పరిష్కారమార్గం చూపిస్తుంది నటి యమున.

"న్యాయంగా మానవత్వం మరిచిపోకుండా వేషాలు లభిస్తే సరి! మన శక్తి వంచనలేకుండా ఆ పాత్రలకు న్యాయం చేకూరుద్దాం, లేదా సంతోషంగా యీ రంగానికి ఒక దణ్ణం పెడదాం. హాయిగా మరో మంచి వృత్తి చూసుకొందాం. వీలుంటే, ఎవరివూరికి వారు వెళ్ళొచ్చు. ఇంటిపట్టునే కూడా నీడ లభించనివారికికూడా గౌరవప్రదంగా బ్రతకటానికి ఎన్నో అవకాశాలున్నాయి. చేతి వృత్తులు నేర్చుకోవచ్చు. మహిళాసంఘంలో చేరి, కొత్తవి తెలిసికొంటూ, తెలియనవి చదువుకొంటూ గౌరవప్రదమైన జీవనానికి పునాదులు నిర్మిద్దాం...." అంటుంది నటి యమున!

నిజమే! గౌరవ ప్రదమైన జీవనానికి పునాదులు పడాలి! ఈ పునాదులమీద దేశము, దేశీయుల ప్రతిష్ఠ యినుమడించే భవనాల నిర్మాణం జరగాలి!

కాని, ఎవరు ముందు రావాలి! ఇది, పిల్లిమెడలో గంట కట్టడమే!

(ఇంకా వుంది)



'శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణుకథ'లో జమున, ఎస్. వి. రంగారావు, ఛాయాదేవి.

చిత్రసమీక్ష:

# శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణు కథ

కళా దర్శకుడు ఏ. కె. శేఖర్‌కు దర్శకత్వపు బాధ్యతనిస్తూ, శంభూఫిలింస్‌వారు నిర్మించిన "శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణు కథ"లో అందరినీ ఆకర్షించే అంశాలెన్నో ఉన్నాయి.

కృష్ణాజిల్లాలోని 'శ్రీకాకుళం' అనే చిన్న పల్లె (ఒకప్పుడు సామ్రాజ్యం) కు సంబంధించిన కథ యిది.

కాస్త చరిత్ర, కాస్త జానపదం కలిపి, ఒకే మూసలో కరగించి, ఆహ్లాదమైన చిత్రంగా తయారు చేశారు దర్శకులు.

బల పరాక్రమ సంపన్నుడైన రాజకుమారుడు ఒకవైపు తన శౌర్యాన్ని, ప్రతాపాన్ని ప్రదర్శించుకొంటూ, మరోవైపు మనసిచ్చిన ప్రియురాలిని తన దాన్ని చేసికొంటాడు. మార్గమధ్యంలో ఎన్నో అవాంతరాలు, కుతంత్రాలు, పన్నాగాలు, పరీక్షలు ఎదురయినా, ఎట్టకేలకు రాజకుమారునికే విజయం సిద్ధిస్తుంది.

నాయికా నాయకులుగా నటించిన శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీమతి జమున ఇందులో ముఖ్య పాత్రధారులు. ఆపదలో చిక్కుకొన్న అందమైన కన్యగా జమున తన లావణ్యాన్ని ప్రదర్శిస్తే, పరాక్రమవంతుడుగా శ్రీ ఎన్. టి. ఆర్. తన ప్రతిభను విశదపరచారు. ఎల్. విజయలక్ష్మి శిల్పాభినయం, ప్రదర్శించిన నృత్యాలు, ఇతర ప్రధానపాత్రల్లో ఎస్. వి. రంగారావు, ఛాయాదేవి, రేలంగి ప్రభృతులు ప్రదర్శించిన నటన చిత్రానికే ఒక నిండుదనం చేకూర్చాయి.



'ఆంధ్రమహావిష్ణుకథ'లో జమున.

శ్రీ పెండ్యాల సమకూర్చిన సంగీతం చిత్రం అంతటా వీనులవిందుగావుంది— శ్రీమతి జానకి ప్రత్యేకించి పాడిన రెండు, మూడు పాటలు బావున్నాయి.

శ్రీ పింగళివారి సాహిత్య సారధ్యం (ఆయనే, ఇందులో సిద్ధహస్తులేగా!), ఎ. కే. శేఖర్ దర్శకత్వం అన్నీ కలిసి శ్రీకాకుళ ఆంధ్ర మహా విష్ణు కథను ఆకర్షణీయంగా రూపొందించాయి.

వి.




ఒకనాడు మౌల్వీ నసీరుద్దీన్ కొడుకును వెంటబెట్టుకుని సముద్రంలో ఓడమీద ప్రయాణమై వెడుతున్నాడు. దారిలో పెద్ద తుఫాను వచ్చింది. వారెక్కిన ఓడ కాగితం పడవలా ఊగిసలాడిపోయింది. ఆ ఓడలో ఉన్న జనం అంతా ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని అల్లాను స్మరించుకుంటున్నారు.

మౌల్వీ కూడా చాలా భయపడ్డాడు. ఆకాశంకేసి చూచి, "ఓ అల్లా! ఈ తుఫాను శాంతింపజేసి, మమ్మల్నిక్షేమంగా ఒడ్డుకి చేరిస్తే, మా ఊరి మసీదులో ఈ తెరచాప కొయ్యలంతకొవ్వొత్తులు వెలిగిస్తాను" అని మొక్కుకున్నాడు.

పక్కనే కూర్చునిఉన్న ఆయన కొడుకు తండ్రి ముఖంలోకి తెరచాప కొయ్యలకేసి చూచి ఇల్లా అన్నాడు.

"అంతంత పెద్ద కొవ్వొత్తులు ఎక్కడ దొరుకుతాయి నాన్నా!"

"ఉష్. గట్టిగా అరవకు. అల్లాకి వినబడుతుంది. మొదట తుఫానుతగ్గించి ఇంటికి చేర్చనీ. తరవాత చూద్దాం!" అన్నాడు మౌల్వీ. ●




## అప్పు

ఒకరోజున పొద్దున్నే మౌల్వీ నసీరుద్దీన్ దగ్గరకు పక్కింటి ఆసామి పర్శగెత్తుకు వచ్చాడు.

"మౌల్వీసాబ్! పీకలమీదికి వచ్చింది, తమరో సాయంచేసి పెట్టాలి."

"ఏమిటదీ?"

"ఉన్నపళాన్ని వందరూపాయలు అవసరమయాయి. తమరు అప్పుగా ఇప్పించాలి. అవితీర్చడానికి ఆరునెలలు గడువుకావాలి. బాబ్బాబు!"

"పెద్ద చిక్కేవచ్చిందే! నాదగ్గర వంద రూపాయలుకాదుకదా, వందచిల్లిడబ్బులు కూడా లేవు. ఇహపోతే మీరెండోకోరిక తీర్చడానికి నాకు అభ్యంతరంలేదు."

ఆవచ్చిన ఆసామీ ఆశ్చర్యపడ్డాడు.

"రెండో కోరిక ఏమిటి?"

"అదే. ఆరునెలలు గడువు కావాలన్నారుగా. ఆరునెలలుకాదు, ఆరేళ్ళు గడువు కావాలన్నా ఇవ్వడానికి నాకుఅభ్యంతరం లేదు." ●

## పుస్తక లోకం

### లోకమాన్యుడు

"లోకమాన్యుడు" : ప్రకాశకులు, శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణస్వామి దేవస్థాన ధర్మకర్తలు, శ్రీమన్నారాయణ పురము, ఉల్లిపాలెము పోస్టు, దివి తాలూకా, కృష్ణాజిల్లా వెల : రు. 1—10.

బాలగంగాధర తిలక్ జీవిత చరిత్రను ఈ గ్రంథం సంగ్రహంగా తెలుపుతుంది. గ్రంథ శైలి అందరికీ అర్థమయి, అందరికీ నచ్చ గలది. కాని అధ్యాయాలు లేకపోవటం, ఒకే పదాన్నివేరువేరుచోట్ల వేరువేరు విధాలుగ రాయటం అతి స్వల్పమయిన అసంతృప్తిని కలిగించవచ్చు. —పి. స.

### చక్కని చుక్కలు

ప్రవాసాంధ్ర ప్రమదల ప్రత్యేక రచనలు. ప్రకాశకులు . ఆంధ్ర విజ్ఞాన సమితి. విర్డినివాస్ : ఎమ్‌రోడ్, జెమ్‌షెడ్‌పూర్, బిహార్. సంపాదకుడు వజ్ఝల కాళిదాసు. వెల . 75 పైసలు.

ఇందులో వ్యాసాలూ, కథలూ, పద్యాలూ ఉన్నాయి. రచనలు అన్నీ స్త్రీలే రచించటంవల్ల పరిమితంగా క్రొత్తదనం కనిపించటంవల్ల ప్రత్యేకత మాట ఎలా ఉన్నా, ఆవేశం మాత్రం బాగా వుంది.

వ్యాసాలలో విషయ విస్తరణ తృప్తిగాలేదు. 'కాలము—ధర్మము'లో విషయ ఔన్నత్యం తగ్గింది. అల్ప విషయ ప్రతిపాదన అధికమయింది. అయినా రచనా విధానంవల్ల ఆలోచింపజేసే వ్యాసమది. గత కాలధర్మం, వర్తమాన కాల ధర్మంతో ఏవిధంగా పోటీ పడుతుందో చూపిన వ్యాస భాగం ముచ్చటగా వుంది. సంఘ శ్రేయస్సు దృష్టితో, భిన్నత్వంలో ఏకత్వం సాధించే ప్రయత్నంతో, వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య అంతరాలు తగ్గాలనే ఊహ చూపే అన్యోన్యంలో, ఆవేశంలో, ఉదాహరణల్లో అల్పత తగ్గితే బాగుండేది.

వూహాలోకంలోని మూర్తి మనస్తత్వం, వాస్తవ జీవితంలో స్పష్టింపబోయి, అతిశయోక్తి చూపిన రచన 'వంకర దారులు.' సంఘ సేవా కార్యక్రమాలు సాగించే ఉద్దేశంతో ఒక చోట కూడిన స్త్రీలు, అత్యవసర స్థితిలో ఎలా వెనకడుగు వేసేది, కీర్తి ప్రతిష్ఠలకు ఎలా ప్రాకులాడేది, చూపుతూ, నిజంగా సంఘాభ్యుదయం కాంక్షించే స్త్రీలు ఎలా బాధలు పడేది ఇతివృత్తంగా సాగిన కథ 'ఆదర్శ మహిళా సంఘం'. ఈ కథ ఒక ప్రశ్న! ఒక సవాలు! కమల, మిసెస్ రావుకంటే అప్పలమ్మ పంతులమ్మ కళ్లలో మెదులుతారు. అనవసర విషయాలు, వర్ణనలు, ఉపవ్యాసాలు తగ్గిస్తే ఇది చక్కని కథే!

ఈ పుస్తకంలో స్త్రీ ఆధిక్యమూ, అనాధిక్యమూ ఉన్నాయి. భాషా దోషాలు పూర్తిగా తొలగింపబడలేదు. వాక్యాలు రెండూ మూడు అన్వయకాఠిన్యంతో ఉన్నాయి. అయినా ప్రవాసి చక్కని చుక్కలు—చూడవచ్చు. —రవి



### రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

సం॥

**Edited Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6&7 Thambu chetty Street, Madras-1. Phones Editorial, 21747; Other depts: 29766. Chief Editor: S Sambhu Prasad.**

